దాదా భగవాన్ నిర్వచనం ప్రకారం

# నేను ఎవరిని?



నీ నిజస్వరూపం నుంచి నీవు
ఎంతకాలం దాగి ఉండగలవు ?
నీవు నిజంగా తెల్సికోవలసిన అవసరం ఉందల్లా
"నేనెవరిని?" అని మాత్రమే.

# త్రిమంత్రము

(సర్వవిఘ్న నివారణ చేసే త్రిమంత్రములు)

## నమో అరిహంతాణం

తమ అంత:శత్రువులైన క్రోధ, గర్వ, లోభ, మోహములను నాశనము చేసిన వారందరికి నా నమస్కారము.

## నమో సిద్ధాణం

ఆత్యంతిక మోక్షమును పొందిన వారందరికీ నేను నమస్కరించుచున్నాను.

## నమో ఆయరియాణం

ఆత్మసాక్షాత్కారమును పొంది మోక్షమార్గమును చూపిన ఆచార్యులందరికీ నా నమస్కారము.

## నమో వజ్ఝాయాణం

ఆత్మ జ్ఞానమును పొందిన ఆధ్యాత్మిక మార్గ గురువులందరికి నా నమస్కారము.

## నమో లోయే సవ్వసాహూణం

ఆత్మ జ్ఞానమును పొంది ఆ మార్గంలో పురోగమించుచున్న ఈ విశ్వంలోని సాధువులందరికీ నేను నమస్కరించుచున్నాను.

## ఏసో పంచ నముక్కారో

ఈ ఐదు నమస్కారములు

## సవ్వ పావప్పనాశనో

సమస్త పాపములను నాశనము  చేయును.

## మంగళానాం చ సవ్వేసిం

మంగళప్రదమైన వాటి అన్నింటిలో

## పఢమం హవయి మంగళం

ఇది సర్వోత్కృష్టము.

## ఓం నమో భగవతే వాసుదేవాయ

మానవుని నుంచి మాధవునిగా మారిన వారందరికి నా నమస్కారము.

## ఓం నమ: శివాయ

మానవాళి మోక్షార్థమై సాధనాలుగా మారిన విశ్వంలోని మంగళస్వరూపులందరికీ నా నమస్కారము.

జై సత్ చిత్ ఆనంద్

శాశ్వతమైన దానియొక్క ఎరుకే ఆనందము.

# జ్ఞాని పురుషుని యొక్క పరిచయం

అది 1958వ సంవత్సరం జూన్ నెలలో ఒకనాటి సాయంత్రం సుమారు ఆరు గంటల సమయం, పశ్చిమ భారత దేశంలోని దక్షిణ గుజరాత్‌లోని ఒక పట్టణమైన సూరత్ రైల్వే స్టేషను. అంబాలాల్ మూల్‌జీ భాయ్ పటేల్ నామధేయుడు, వృత్తి రీత్యా కాంట్రాక్టరూ అయిన ఒక గృహస్థుడు జనసమూహంతో రద్దీగా వున్న సూరత్ స్టేషన్‌లోని మూడవ నెంబరు ప్లాట్‌ఫాం బెంచిపైన కూర్చుని ఉన్నారు. ఆ సమయంలో నలభైఎనిమిది నిమిషములపాటు ఒక అద్భుతం జరిగింది. అకస్మాత్తుగా అంబాలాల్ మూల్‌జీభాయ్ పటేల్‌లోని ఆత్మ సాక్షాత్కారమైంది. ఆ సమయంలో అతని అహంకారం సమూలంగా దగ్ధమైపోయింది. ఆ క్షణం నుంచి అతను అంబాలాల్ యొక్క ఆలోచనలు, వాక్కు మరియు క్రియలన్నింటినుంచి పూర్తిగా వేరుచేయబడి, జ్ఞానమార్గం ద్వారా మానవాళికి ముక్తిని ప్రసాదించే నిమిత్తం భగవంతుని చేతిలో సజీవ పరికరంగా మారారు. ఆయన తనకు ప్రకటితమైన పరమాత్మని దాదాభగవాన్ అని పిలిచారు. "ఈ పరమాత్మ, దాదాభగవాన్ నాలో పూర్ణరూపంలో వ్యక్తమైనాడు; మీలో అవ్యక్తంగా ఉన్నాడు. భేదం ఇంతమాత్రమే. ఆయన జీవులందరిలోను విరాజమానుడై ఉన్నాడు.'' అని తనను కల్సిన ప్రతి ఒక్కరితోనూ చెప్పేవారు.

మనం ఎవరము? భగవంతుడంటే ఏమిటి? జగత్తును ఎవరు నడిపిస్తున్నారు? కర్మ ఏమిటి? మోక్షం ఏమిటి? ఇత్యాది సమస్త ఆధ్యాత్మిక ప్రశ్నలకు ఆ సందర్భంలో సమాధానం లభించింది. ప్రకృతి శ్రీ అంబాలాల్ మూల్‌జీ భాయ్ పటేల్ ద్వారా ప్రపంచానికి సంపూర్ణ తత్త్వరహస్యాన్ని వెల్లడిచేసింది.

శ్రీ అంబాలాల్ జన్మస్థలం బరోడాపట్టణ సమీపంలోని తారాసలి; పెరిగింది గుజరాత్‌లోని బాదరణ్ గ్రామం. ఆయన ధర్మపత్ని హీరాబా. వృత్తిరీత్యా కాంట్రాక్టరు అయినప్పటికీ ఆత్మసాక్షాత్కారం పొందటానికి ముందు కూడా అతని వ్యావహారిక జీవనం ఇంట్లోను, చుట్టు ప్రక్కలవారితోను కూడా ఎంతో ఆదర్శప్రాయంగా ఉండేది. ఆత్మ సాక్షాత్కారం పొందిన తరువాత జ్ఞానిగా ఆయన జీవితం ప్రజలకే అంకితమైంది.

వ్యాపారంలో ధర్మం ఉండాలి, ధర్మంలో వ్యాపారం ఉండకూడదు అనే నియమాన్ని ఆయన జీవితమంతా అమలుపరచారు. భక్తులచే దాదాశ్రీగా పిలువబడే ఆయన ఎన్నడూ ఎవరినుంచీ స్వంత ఖర్చుల నిమిత్తం ధనాన్ని స్వీకరించలేదు. పైగా తనకు వ్యాపారంలో లభించిన లాభాలను, భక్తులను భారతదేశంలోని వివిధ యాత్రా స్థలాలకు తీసికొనివెళ్లటానికి వినియోగించేవారు.

దాదాజీ మాటలు అక్రమవిజ్ఞాన్‌గా పిలువబడే కొత్త, డైరెక్ట్ మరియు మెట్లదారికాని లిఫ్ట్ మార్గమైన ఆత్మానుభూతి మార్గానికి పునాది అయ్యాయి. అతడు తన దివ్య ప్రాచీన విజ్ఞాన ప్రయోగం (జ్ఞాన విధి) ద్వారా కేవలం రెండు గంటలలో ఈ జ్ఞానాన్ని ఇతరులకు అందచేశారు. వేలకొలది ముముక్షువులు ఈ విధానం ద్వారా ఆయన అనుగ్రహాన్ని పొందినారు, ఇప్పటికీ వేలకొలది ముముక్షువులు పొందుతూనే ఉన్నారు. అక్రమమార్గం అంటే మెట్లు లేనిది, లిఫ్ట్‌మార్గం లేక షార్ట్‌కట్ మార్గం. క్రమ మార్గం అనగా మెట్టుతర్వాత మెట్టు క్రమంగా ఎక్కే ఆధ్యాత్మిక మార్గం. ఇపుడు అక్రమమార్గం ఆత్మానుభూతి నిమిత్తం డైరెక్ట్, షార్ట్‌కట్ మార్గంగా గుర్తింపబడింది.

## దాదా భగవాన్ ఎవరు?

దాదా భగవాన్ ఎవరు? అనే విషయాన్ని వివరిస్తూ ఆయన ఇలా అన్నారు :

"మీకు కన్పించేది 'దాదాభగవాన్' కాదు. మీరు చూస్తున్నది ఎ.ఎమ్. పటేల్‌ని. జ్ఞానిపురుషుడనైనా నాలోపల పూర్ణరూపంలో వ్యక్తమైన భగవంతుడు 'దాదాభగవాన్'. ఆయన చతుర్దశ భువనాలకు ప్రభువు. ఆ దాదాభగవాన్ మీలోను, ప్రతి ఒక్కరిలోను కూడా ఉన్నారు. మీలో అవ్యక్తరూపంలో ఉంటే, ఇక్కడ (ఎ.ఎమ్. పటేల్ దేహంలో) సంపూర్ణంగా అభివ్యక్తమైనాడు. నేను దాదా భగవాన్ కాదు. నాలోపలి దాదాభగవాన్‌కి నేను కూడా నమస్కరిస్తాను.

## జ్ఞాన (ఆత్మజ్ఞాన) ప్రాప్తికై వర్తమానలింక్

"నేను స్వయంగా సిద్ధులను (ప్రత్యేక ఆధ్యాత్మిక శక్తులను) కొద్దిమందికి ప్రసాదించబోతున్నాను. నేను వెళ్లిపోయిన తర్వాత వాటి అవసరం ఉండదా ? భవిష్యతరాల ప్రజలకు ఈ మార్గం యొక్క అవసరం ఉంటుంది, అవునా?''

- దాదాశ్రీ

పరమపూజ్య దాదాశ్రీ గ్రామ గ్రామమూ, దేశవిదేశాలు పర్యటించి ముముక్షువులకు సత్సంగంతోపాటు ఆత్మజ్ఞాన ప్రాప్తిని కలిగించారు. దానితోపాటు సంఘీభావంతో కూడిన ప్రాపంచిక వ్యవహర జ్ఞానాన్ని కూడా తనను కల్సిన వారందరికీ అందించారు. ఆయన తన అవసానదశలో, **1987** చివర్లో తన కార్యాన్ని కొనసాగించే నిమిత్తం డాక్టరు నీరుబెన్ అమీన్‌కి సిద్ధులను అనుగ్రహించారు.

పరమపూజ్య దాదాశ్రీ జనవరి **2, 1988**న దేహత్యాగం చేసిన తర్వాత డా॥ నీరుబెన్ భారతదేశ గ్రామాలలోనూ, పట్టణాలలోనూ, ప్రపంచంలోని అన్ని ఇతర దేశాలలోనూ పర్యటిస్తూ దాదాశ్రీ కార్యాన్ని కొనసాగించారు. మార్చి **19, 2006**న దేహత్యాగం చేసేవరకు ఆమె అక్రమవిజ్ఞాన్‌కి దాదాశ్రీ ప్రతినిధిగా వున్నారు. దేహ త్యాగానికిముందు ఆమె ఆ కార్యభారాన్ని శ్రీ దీపక్ భాయ్ దేశాయ్‌కి అప్పగించారు. ఆధునిక కాలంలో ఆత్మానుభూతికి సరళమూ మరియు డైరెక్ట్ మార్గంద్వారా అక్రమ విజ్ఞానాన్ని వ్యాపింపచేయటంలో డా. నీరుబెన్ సాధనం అయి ప్రముఖ పాత్రను పోషించారు. లక్షల కొలది ముముక్షువులు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొన్నారు. వారు తమ సంసార బాధ్యతలు నిర్వర్తిస్తూ కూడాస్వేచ్ఛను, శాంతిని, ఆత్మరమణత యొక్క అనుభూతిని పొందుతున్నారు.

అక్రమ విజ్ఞాన సత్సంగం నిర్వహించే నిమిత్తం జ్ఞాని పురుష్ దాదాశ్రీ పూజ్య నీరుబెన్ అమీన్ సమక్షంలో శ్రీ దీపక్‌భాయ్ దేశాయ్‌కి సిద్ధిని ప్రదానం చేశారు. **1988-2006** మధ్యకాలంలో దాదాశ్రీ దిశానిర్దేశానుసారం, డా. నీరుబెన్ అమీన్ నాయకత్వంలో దేశవిదేశాలలో శ్రీ దీపక్ భాయ్ సత్సంగ్ నిర్వహించారు. ఈ అక్రమ విజ్ఞాన్ యొక్క జ్ఞానవిధులు, సత్సంగ్‌లు ఇపుడు పూర్తిస్థాయిలో ఆత్మజ్ఞాని శ్రీ దీపక్ భాయ్ దేశాయ్ మాద్యమం ద్వారా కొనసాగుతున్నాయి.

శాస్త్రాలలోని శక్తివంతమైన పదాలు మోక్షకాంక్షను వృద్ధి చేయటంలో సహకరిస్తూ ఆ మార్గానికి ప్రాతినిధ్యం వహిస్తాయి. ముముక్షువులందరికీ ఆత్మజ్ఞానమే అంతిమ లక్ష్యం. స్వరూప జ్ఞానం లేకుంటే మోక్షం లేదు. ఈ జ్ఞానం పుస్తకాలలో లభించదు. అది జ్ఞాని హృదయంలో వుంటుంది. కనుక ఆత్మజ్ఞానాన్ని ప్రత్యక్షజ్ఞాని నుంచి మాత్రమే పొందగలం. అక్రమ విజ్ఞాన్ యొక్క విజ్ఞాన ప్రయోగం ద్వారా ప్రత్యక్ష జ్ఞానినుంచి నేడుకూడ ప్రతి ఒక్కరూ ఆత్మజ్ఞానాన్ని పొందవచ్చు. ఒక జ్యోతి మాత్రమే మరొక దీపాన్ని వెలిగించగలదు.

* * * *

# అనువాదకుని విజ్ఞప్తి

అంబాలాల్ ఎమ్. పటేల్ నామధేయులైన జ్ఞానిపురుషుని దాదాశ్రీ లేక దాదా లేక దాదాజీ గా భక్తులందరూ పిలుస్తారు. ఆత్మ విజ్ఞాన సంబంధమైన మరియు ప్రపంచ వ్యవహార జ్ఞాన సంబంధమైన తన సత్సంగాన్ని యధాతధంగా అనువదించటం సాధ్యం కాదని ఆయన తరచూ చెప్పేవారు. అనువాద క్రమంలో లోతైన, సహేతుకమైన అర్ధం ముముక్షువులకు అందకపోవచ్చు అనికూడా దాదాశ్రీ చెప్పేవారు. గుజరాతీ భాషని నేర్చుకోవటంలోని ప్రాముఖ్యతను ఆయన నొక్కి వక్కాణించేవారు. తద్వారానే దాదాశ్రీ అమూల్యమైన బోధల సంపూర్ణసారాన్ని యధాతధంగా గ్రహించే అవకాశం ఉంటుందని దాదా మాటల సారాంశం.

అయినప్పటికీ దాదాశ్రీ తన బోధలను ఇంగ్లీషు మరియు ఇతర భాషలలోకి అనువదించటానికి, తద్వారా ప్రపంచంలోని యావత్తు ప్రజానీకానికి అందించటానికి తమ ఆశీర్వాదాన్ని అనుగ్రహించారు. తనలో ప్రకటితమైన ఈ అక్రమ విజ్ఞానాన్ని ప్రపంచంలోని మానవాళి పొంది తమ బాధలనుంచి విముక్తి పొందాలని, జీవన్ముక్తిని అనుభవించాలని దాదాజీ యొక్క ప్రగాఢమైన వాంఛ. ఈ విజ్ఞానం యొక్క అద్భుతమైన శక్తులను ప్రపంచం గుర్తించి ప్రణమిల్లే రోజు వస్తుందని కూడా దాదాజీ చెప్పారు.

జ్ఞానిపురుషులైన దాదాశ్రీ బోధలను తెలుగుభాష ద్వారా తెలుగు ప్రజలకు అందించటం కోసం చేసిన చిన్న ప్రయత్న ఫలమే ఈ పుస్తకం యొక్క అనువాదం. యధాతధంగా అందించలేకపోయినా సత్సంగ సందేశాన్ని, భావాన్ని ఎటువంటి చెఱుపు లేకుండా అందించడంకోసం ఎంతో శ్రద్ధ వహించటం జరిగింది.

అనంతమైన దాదాజీ జ్ఞాన ఖజానాకి ఇది ప్రాధమిక పరిచయం మాత్రమే. ఈ అనువాదంలో ఏమైన తప్పులు దొర్లివుంటే అవి పూర్తిగా అనువాదకులవే అని గమనించగలరు. వాటినిమిత్తమై మేము మీ క్షమను అర్ధిస్తున్నాము.

* * * *

# తొలి పలుకు

జీవించటం వేరు. బ్రతకటం వేరు. బ్రతకటం కంటె జీవించటం ఎంతో ఉన్నతమైనది. గాలి పీల్చడం, తినటం మొదలైనవి బ్రతుకుకి గుర్తులు; ఆధ్యాత్మిక వికాసం, ఆత్మోన్నతి, ఆనందంగా జీవించుచున్నదానికి గుర్తులు. జీవితం ఒక ఉన్నత లక్ష్యం కలిగి ఉండాలి. 'నేనెవరిని?' అనే ప్రశ్నకు నిజమైన సమాధానాన్ని పొందటమే మానవ జన్మ పరమార్ధం. గత అనంతజన్మలుగా ఇది సమాధానంలేని ప్రశ్నగానే మిగిలిపోయింది. అందువల్లనే ఈ సంసారచక్రంలో పరిభ్రమణకి అంతం లేకుండా ఉంది. ఈ ప్రశ్నకి సమాధానం ఎలా దొరుకుతుంది?.

తనను తాను తెలిసికొన్న జ్ఞాని ఇతరులకు తేలికగా వారి స్వరూపాన్ని తెలియచేయగలడు. అది జ్ఞానిపురుషుని దివ్యశక్తి. ఈ ప్రపంచంలో ఎవరికైతే తెల్సుకోవలసినదిగాని, చేయవలసినదిగాని ఏమీ మిగిలి ఉండదో అతడేజ్ఞాని. అటువంటి జ్ఞాని పురుషులైన పరమపూజ్య దాదాశ్రీ ఈ కాలంలో మనమధ్యకు వచ్చి మనకు బోధపడే సరళమైన భాషలో సహజమైన పద్ధతిలో " నేనెవరిని?'' అనే ప్రతిఒక్కరి ప్రధానప్రశ్నకి సమాధానం చెప్పారు.

నేను ఎవరు? నేను కానిది ఏమిటి? ఆత్మ అంటే ఏమిటి? ఏది నాది? ఏది నాది కాదు? బంధం ఏమిటి? మోక్షం ఏమిటి? భగవంతుడున్నాడా? భగవంతుడంటే ఏమిటి? ఈ ప్రపంచంలో కర్త ఎవరు? కర్త భగవంతుడా? కాదా? భగవంతుని నిజ స్వరూప స్వభావం ఏమిటి? ప్రపంచంలో నిజమైన కర్త యొక్క స్వభావం ఏమిటి? ప్రపంచాన్ని ఎవరు నడుపుతున్నారు? అది ఎలా పనిచేస్తుంది? మాయయొక్క నిజ స్వభావం ఏమిటి? మనిషి తెల్సుకొన్నది ఏదైనా అది వాస్తవమా లేక భ్రమా? మనిషి తనకు కలిగిన జ్ఞానం వల్ల ముక్తిని పొందగల్గుతున్నాడా లేక బద్ధుడిగానే మిగిలి పోతున్నాడా ?

ఈ ప్రశ్నలన్నింటి వెనుక ఉన్న అక్రమవిజ్ఞానం (సూటిగ మోక్షానికి చేర్చే లిఫ్ట్ మార్గము యొక్క జ్ఞానం) యొక్క సారాంశం కూడ ఈ పుస్తకం ద్వారా పాఠకులకు పరిచయం చేయబడింది.

డా. నీరుబెన్ అమీన్

# నేను  ఎవరిని?

## (1) నేను ఎవరిని?
## ముక్తికి సరియైన మార్గము

దాదాశ్రీ : మీ నామధేయం ఏమిటి?

ప్రశ్నకర్త : నా పేరు 'చందూలాల్.'

దాదాశ్రీ  : నువ్వు నిజంగా 'చందూలాల్' వేనా?

ప్రశ్నకర్త : అవును.

దాదాశ్రీ : 'చందూలాల్' నీ పేరు. అవునా కాదా? నీవు చందూలాల్‌వా లేక నీ పేరు చందూలాలా?

ప్రశ్నకర్త : అదినా పేరు.

దాదాశ్రీ : మరి నీవు ఎవరు? 'చందూలాల్' నీ పేరు అయినట్లయితే నీవు ఎవరు? నీవు,నీపేరు వేరువేరు కాదా? నీ పేరు కంటే నీవు వేరయినట్లయితే మరి నీవెవరు? నేను ఏమిచెప్ప ప్రయత్నిస్తున్నానో నీవు గ్రహించావా? "ఇవి నాకళ్ళద్దాలు'' అని నీవు చెప్పినచో నీవువేరు, అద్దాలు వేరు అవునా? అదేవిధంగా నీపేరు కంటె నీవువేరు అని నీకు తెలియటంలేదా?

అదేవిధంగా ఒక దుకాణానికి 'జనరల్ ట్రేడర్స్' అని పేరుపెట్టటంలో తప్పులేదు. కానీ ఆ షాపు యజమానిని పిలువవలసి వచ్చినప్పుడు "ఓ జనరల్ ట్రేడర్స్ ఇలారా'' అని పిల్చినట్లయితే "నాపేరు జయంతిలాల్. జనరల్ ట్రేడర్స్ నా షాపు పేరు'' అని అతను సమాధానం చెప్తాడు. షాపు యజమాని, షాపు, షాపులోని వాణిజ్యసరుకులు ఇవన్నీ వేర్వేరు అవునా కాదా? నీకేమనిపిస్తుంది ?

ప్రశ్నకర్త : నిజమే.

దాదాశ్రీ : కానీ నీ విషయంలో 'కాదు, నేనే చందూలాల్' అంటున్నావు. షాపు యజమాని, షాపుకు తగిలించిన బోర్డు రెండూ నేనే అని దాని అర్థం కదా ! 'చందూలాల్' అనేది కేవలం గుర్తింపుసాధనం.

నీ బాల్యం నుంచి నిన్ను అందరూ 'చందూ' అని పిలుస్తూండటం వల్ల నీవు 'నేను చందూ' అనుకొంటున్నావు. ఈ పేరునే నీవుగా భావిస్తున్నావు. నిజానికి నీవు చందూలాల్ కాదు. నిజానికి నీవెవరివో నీకు తెలియని కారణంగా నీకు పెట్టిన పేరునే నీవని నమ్ముతున్నావు. ఈ నమ్మకం నీమనస్సుపై శక్తివంతమైన ప్రభావాన్ని చూపెడుతుంది. 'నేను చందూలాల్' అనే తప్పుడు విశ్వాసం నీలో చాలా లోతుగా పాతుకొని పోయింది. ఈ రాంగ్ బిలీఫ్ కారణంగా కళ్ళుతెరచి నిద్రించిన విధంగా నీవు అసంఖ్యాకమైన జన్మలను అనుభవించావు.

## 'నేను' ను గుర్తించటం

దాదాశ్రీ : నీవు నిజంగా ఎవరివి అనే విషయాన్ని నీవు జాగ్రత్తగా విచారించ వలసి ఉన్నదా లేదా? నీ నిజ స్వరూపాన్ని నీవు తెల్సుకోకుండా ఎంతకాలం ఇలా చీకటిలో ఉండగలవు? నిజమైన ఐడెంటిటీని లేదా గుర్తింపుని కనిపెట్టక పోవటం అజ్ఞానం అని నీవు తలంచుట లేదా?

నిజంగా నీవెవరివో స్వానుభవపూర్వకంగా గుర్తించనంతవరకు నీవు తెల్సుకొన్నవి అన్నీ అసత్యాలు, తప్పులే. నీవు ఈ వాచ్ కొనేముందు దాని తయారీని, విశిష్ఠత, ధర, వారంటీ ఇత్యాదులన్నీ విచారించి తెల్సుకోలేదా? మరి నీగురించి నీవు తెలుసుకోకపోవటం ఎంతవరకు సమంజసం? నీవెవరివి? ఎక్కడి నుంచి వచ్చావు? ఎక్కడున్నావు? నీ నిజమైన వ్యక్తిత్వాన్ని గురించిన పరిజ్ఞానం నీకులేదు. వీటిలో దేని గురించీ నీకు తెలియదు. నేనెవరిని? అనే ప్రధాన ప్రశ్నకు సమాధానం తెల్సుకోకుండా ఈ ప్రాపంచిక వ్యవహారాలలో చురుకుగా పాల్గొనటంవల్ల నీ జీవితాన్ని నీవే మరింత జటిలం చేసికొంటావు. ఈ అజ్ఞాన స్థితిలో వివాహం చేసికోవటం, సంసారాన్ని కల్గియుండటం ఇత్యాదుల కారణంగా నీ జీవితాన్ని నీవే మరింత గందరగోళం చేసికొంటావు. ఈ విధంగానే ప్రాపంచికమైన ఎన్నో కఠిన సమస్యలు, భ్రమలు తలెత్తుతాయి.

రాత్రి నీవు నిద్రించే సమయంలో కూడా నీవు చందూలాల్ గానే వ్యవహరిస్తావు. ఇదే రాంగ్ బిలీఫ్ రాత్రంతా దానంతట అదే ఇంకా ఇంకా బలపడ్తుంది. ఎవరైనా

చందూలాల్ ని దూషిస్తే దానికి నీవు ప్రభావితుడవవుతావు. "నేనెవరిని?" అనేదానిని నీవు తెలుసుకొన్నపుడు మాత్రమే ఈ రాంగ్ బిలీఫ్ ఆగిపోతుంది. ఈ రాంగ్ బిలీఫ్ కారణంగానే నీవు ఒక జన్మనుంచి మరొక జన్మకి సంచరించవలసి వస్తోంది. నీ నిజమైన ఐడెంటిటీ నీకు తెలియదు పై పెచ్చు నీవు కాని దానిని నీవు అనే నమ్మకాన్ని నీ మనస్సుపై బలంగా ముద్రించుకొంటున్నావు. ఈ మూఢనమ్మకాన్ని నీకు నీవుగా ఆపాదించుకొని, అందుకు తగినట్లుగానే ప్రవర్తిస్తుంటావు. ఈ మిథ్యాభియోగం చాలా పెద్ద పొరపాటు. ఈ పొరపాటే జీవితంలోని అన్ని బాధలకూ, దు:ఖానికి, ఆంతరంగిక అశాంతికీ, అసంతృప్తికీ మూలకారణం. 'నేను చందూలాల్' అనే రాంగ్ బిలీఫ్ కారణంగానే వర్తమానంలో నీలో ఎన్నో చింతలు చోటుచేసికొని వున్నాయి. ఈ రాంగ్ బిలీఫ్ని నీపై నీవు ఆరోపించుకోవటం అజ్ఞానమే కాక మరిన్ని బాధలకు హేతువౌతుంది.

## (2) నమ్మకములు రాంగ్, రైట్ అనేక మూఢనమ్మకాలు

దాదాశ్రీ : "నేను చందూలాల్" అనే నమ్మకం నిద్రించేసమయంలో కూడ నిన్ను వదలదు. నీ వివాహం జరిగినపుడు ప్రజలునీతో "నీవు ఈ స్త్రీకి భర్తవు" అని చెప్పారు. నీవు ఆపాత్రని అంగీకరించి భర్తలాగే ప్రవర్తిస్తావు. అది అలాగే కొనసాగి 'నేను భర్తను' అనే నమ్మకము నీలో బలపడిపోతుంది. ఎవరైనా ఎప్పటికీ భర్త కాగలరా? నీవు విడాకులు పొందినప్పటికీ ఆమెకు భర్తవు అవుతావా? ఇటువంటి మూఢనమ్మకాలు అన్నీ నీలో లోతుగా పాతుకొని పోయాయి.

మొదటి రాంగ్ బిలీఫ్ 'నేను చందూలాల్.' 'నేను ఈ స్త్రీ యొక్క భర్తను' అనేది రెండవ రాంగ్ బిలీఫ్. 'నేను హిందువుని' ఇది మూడవ రాంగ్ బిలీఫ్. 'నేను లాయర్ని' అనేది నాలుగవ రాంగ్ బిలీఫ్. 'నేను ఈ బాలుని తండ్రిని' ఇది ఐదవ రాంగ్ బిలీఫ్. 'నేను ఇతని యొక్క అంకుల్ని' ఇది ఆరవ రాంగ్ బిలీఫ్. 'నేను తెల్లగా వుంటాను' ఇది ఏడవ రాంగ్ బిలీఫ్. 'నా వయస్సు 45 సంవత్సరాలు' ఇది ఎనిమిదో రాంగ్ బిలీఫ్. 'నేను ఇన్కంటాక్సు పేయర్ని' అని నీవు చెప్పినట్లయితే అది ఇంకొక రాంగ్ బిలీఫ్. ఇటువంటి ఎన్ని రాంగ్ బిలీఫ్స్ నీకున్నాయి?.

ప్రశ్నకర్త : చాలానే వున్నాయి ?

దాదాశ్రీ : 'నేను' కాని చోట 'నేను' ను నువ్వు ఎక్కడెక్కడ ఆరోపిస్తున్నావో అది రాంగ్ బిలీఫ్. ఈ రాంగ్ బిలీఫ్స్ అన్నింటినీ తొలగించుకోవాలి. ఇన్ని రాంగ్ బిలీఫ్స్‌తో నువ్వు ఎలా సంతోషంగా ఉండగలవు ? ఇప్పుడు చెప్పు. ఎటువంటి బిలీఫ్ మనిషికి సంతోషాన్నిస్తుంది?

ప్రశ్నకర్త : ఏ నమ్మకాలూ లేని వ్యక్తి ఆనందంగా వుంటాడు.

దాదాశ్రీ : కాదు. ఏ బిలీఫ్ లేకుండా ఎవరూ ఉండలేరు. కాని ఉండవలసింది రైట్ బిలీఫ్.

ప్రశ్నకర్త : ఏ నమ్మకాలు లేకుండా ఉండటం సాధ్యమేనా?

దాదాశ్రీ : మనం లాస్ ఏంజెల్స్ నుండి శాన్ ఫ్రాన్సిస్కోకి వెళ్లవలసిఉన్నది అనుకొందాం. కానీ మనం పొరపాటుగా శాంటియాగో వెళ్లే మార్గంలో వెళ్లాం. అపుడు మనం శాంటియాగో మార్గం నుంచి లాస్ ఏంజెల్స్‌కి (ఒరిజినల్‌ప్లేస్ లేదా బయలుదేరిన చోటుకు) వెనక్కి రావాలా లేదా? అదే విధంగా మనం మన ఒరిజినల్ స్థానానికి తిరిగి రావటానికి రైట్ బిలీఫ్‌ని నిలుపుకోవలసిన అవసరంవుంది. బయలుదేరిన చోటునుంచి ఎంతదూరం తప్పు మార్గంలో ప్రయాణించామో అంతదూరం తిరిగి వెనక్కి రావాలి. ఆ తర్వాత సరియైన దారిలో ప్రయాణించటం ద్వారా గమ్యాన్ని చేరగలం. ఒకసారి నీవు రాంగ్ బిలీఫ్స్ నుండి బయటపడి కొంతకాలం రైట్ బిలీఫ్‌ని నిలుపుకొన్నట్లయితే నీవు ఒరిజినల్ స్థానాన్ని చేరగలవు. ఆ తర్వాత ఏ బిలీఫ్‌నీ నిలుపుకోవలసిన అవసరం ఉండదు. ఇక నీ పని పూర్తి అయినట్లే.

ఇప్పుడు నీవీ రాంగ్ బిలీఫ్స్ అన్నింటినీ ఎలా తొలగించుకోగలవు?

ప్రశ్నకర్త : నాకు తెలియదు. అందుకు మీ మార్గదర్శనం నాకు అవసరం.

దాదాశ్రీ : నిజమే. అనంత జన్మలుగా లక్ష్యరహితంగా ప్రపంచంలో పరిభ్రమిస్తున్న మనిషికి రాంగ్ బిలీఫ్‌ని తొలగించుకోగల పరిజ్ఞానం లేదు. తనది రాంగ్ బిలీఫ్ అని మనిషి తెలుసుకొన్నప్పటికీ దానిని ఎలా తొలగించుకోవాలో అతనికి తెలియదు. ఒక్కరాంగ్ బిలీఫ్‌ని కూడ తొలగించుకోకుండానే అనేక జన్మలు గడిచిపోయాయి.

## తప్పు స్థానంలో 'నేను'

దాదాశ్రీ : 'నేను చందూలాల్' ని అనే విశ్వాసము అహంకారం. 'నేను' కాని చోట 'నేను' ను ఆరోపించటం అహంకారం.

ప్రశ్నకర్త : 'నేను చందూలాల్' ని అని చెప్పటం అహంకారం ఎలా అవుతుంది? 'నేను చాలా గొప్పవాడిని' లేక 'నేను అందరికంటె స్మార్ట్' అని చెప్తే అది వేరే విషయం. నేను చాలా సహజంగా 'నేను చందూలాల్' అని చెప్తే దానిలో అహంకారం ఎక్కడుంది?

దాదాశ్రీ : నువ్వు ఎంత సహజ భావంతో చెప్పినప్పటికీ అహంకారం వెళ్ళిపోతుందా? 'నాపేరు చందూలాల్' అని నువ్వు సహజంగా చెప్పినప్పటికీ అది అహంకారమే అవుతుంది. నీవు ఎవరివో నీకు తెలియకపోవటం నీవు కాని దానిని నీవుగా ఆరోపణచేయటం అహంకారమే. 'నేను' కాని దానిని 'నేను' అనుకోవటం అహంకారం. 'నేను చందూలాల్' అనేది సంసారరూప నాటకంలో నీ పాత్రపేరు మాత్రమే. 'నేను చందూలాల్' అని వ్యావహారిక దృష్టిలో చెప్పినచో నష్టం లేదు. కాని 'నేను చందూలాల్' అనే బిలీఫ్ నీలో దృఢంగా పాతుకొని పోకూడదు. లౌకిక వ్యవహారంలో గుర్తింపు కోసం మాత్రమే 'చందూలాల్' అనే పేరు ఉద్దేశింపబడింది.

ప్రశ్నకర్త : నిజమే. లేకుంటే 'నేను చందూలాల్' అనే అహం చోటుచేసుకుంటుంది.

దాదాశ్రీ : 'నేను' నేనుయొక్క నిజస్థానంలో ఉన్నచో అది అహంకారం కాదు. 'నేను చందూలాల్' అని నీవు నమ్మినట్లయితే 'నేను' ను చందూలాల్ పై తప్పుగా ఆరోపించినందువల్ల అహంకారం అవుతుంది. 'నేను' ఆరోపిత స్థానం (చందూలాల్) నుంచి మూలస్థానానికి వస్తే అహంకారం పోతుంది. అందువల్ల నీవు 'నేను'ను తొలగించనవసరంలేదు కానీ దానిని సరియైన స్థానంలో ఉంచాలి.

## రైట్ బిలీఫ్, రాంగ్ బిలీఫ్

'మిథ్యాత్వం' అనే పదాన్ని ప్రజలు తరచుగా ప్రయోగిస్తుంటారు కాని దాని అర్థం ఎవరికీ తెలియదు. అందువల్లనే ప్రపంచం ఇటువంటి కోలాహల పూరితమైన ఉపద్రవస్థితిలో కొనసాగుతుంది. రాంగ్ బిలీఫ్ అంటేనే మిథ్యాత్వం. ఫ్యాషన్ వస్త్రాలు ధరించటం, వివాహం చేసికోవటం మిథ్యాత్వం కాదు. మిథ్యాత్వం అంటే రాంగ్ బిలీఫ్స్

మాత్రమే. రైట్ బిలీఫ్‌ని పొందితే అది సమ్యక్ దర్శన్ లేక సమ్యకత్వ (జ్ఞానమయ ప్రాపంచిక దృష్టి, యదార్ధ జ్ఞానము) అని చెప్పబడుతుంది. ఏనమ్మకము ఒకరిని ఆత్మగా దర్శింపచేయగలదో అది సమ్యక్ దర్శనము.

ప్రకాశమయ జ్ఞానదృష్టిని పొందవలసిన అవసరం ఎంతైనావుంది. ఈ రాంగ్ బిలీఫ్స్ అన్నీ నాశనం గావింపబడి రైట్ బిలీఫ్ స్థాపన జరిగినప్పుడు జ్ఞాన దృష్టి ప్రాప్తిస్తుంది. అపుడు మాత్రమే ఎవరైనా ప్రపంచాన్ని ఉన్నదానిని ఉన్నట్లుగా దర్శించగలరు.

ఇప్పటివరకు నీవన్నీ రాంగ్ బిలీఫ్స్ అనే విషయమే నీకు తెలియదు. ఇంతవరకు నిన్ను నీవు 'నేను చందూలాల్' అని నమ్మావు. ఇవిఅన్నీ వ్యావహారికమైన తాత్కాలిక సర్దుబాట్లు మాత్రమే. నీవు శాశ్వతుడవు. కానీ 'నేను శాశ్వతుడను' అనే ఎరుక నీకింతవరకూ కలుగలేదు.

## తనకు తానే అపరిచితుడు

నీ ఆత్మనుంచి దాక్కొని ఉండటంకోసం నీవు అనేక జన్మలుగా చేసిన ప్రయత్నం ఇది. అనేక జన్మలుగా నీ నిజస్వరూపాన్ని గురించి నీవు తెలుసుకొనకుండా, అనాత్మను గురించిన అన్ని విషయాలలో పరిజ్ఞానం పొందటం వింత కాదా? నీ నిజస్వరూపం నుంచి నువ్వు ఎంతకాలం దాగి వుండగలనని అనుకుంటున్నావు? తానెవరో తాను అన్వేషించి తెలుసుకోవటం కోసమే మానవజన్మ ఉద్దేశింపబడింది. లేకుంటే జననమరణరూపంలో రాకపోకలు సాగించక తప్పదు. 'నేనెవరు?' అనే ప్రశ్నకు సమాధానాన్ని తెల్సుకోవటం అత్యంత ఆవశ్యకమని నీకు అన్పించటంలేదా? నీవు నిజానికి ఎవరివో విచారించవలసిన అవసరం నీకు లేదా?

## (3) 'నేను' మరియు 'నాది' వీటిని వేరు చేసే ప్రయోగం 'నాది' వేరు చేయటంవల్ల ప్రయోజనం స్వస్వరూపానుభూతి

ప్రశ్నకర్త : దాదాజీ, నా నిజస్వరూపాన్ని నేను ఏ పద్ధతి లేక ఉపాయంవల్ల తెలియగలను?

దాదాశ్రీ : 'నేను' అనేది మూల తత్త్వము (వస్తుస్వరూపం, శాశ్వతం). 'నాది'

అనేది సంయోగస్వరూపం (పరిస్థితుల సంయోగం వల్ల ఏర్పడింది). మూలతత్త్వము, సంయోగస్వరూపము ఎప్పుడూ వేరుగానే వుంటాయి. 'నేను' అన్నది సహజమూల స్వరూపము.

'నేను' అంటే భగవంతుడు, 'నాది' అనేది మాయ (భ్రమ). నాది అని చెప్పబడే ప్రతిదీ మాయే. అనేక రకాలైన మాయ 'నాది' అని వ్యవహరించబడుతుంది. నువ్వు దేనినైనా 'నాది' అని చెప్పిన క్షణంలోనే మాయ ప్రభావానికి లోను అవుతున్నావు. 'నాది' అని నీవు వేనిని పేర్కొంటున్నావో వాటితో నీవు మమత్వం కల్గి ఉంటున్నావు. ఆ విధంగా 'నేను', 'నాది' అనే దానికి జత అవుతుంది. కానీ 'నాది' అనేది 'నేను'తో జత (Attach) కాలేదు. 'నేను' కు సంబంధించినది 'నాది'.

'నేను' మాత్రమే స్వతంత్రప్రతిపత్తి కల్గిఉంది. 'నాది' అని చెప్పబడే ప్రతిదీ భిన్న స్వభావం కలది మరియు అనాత్మ విభాగానికి చెందినదే గాని ఆత్మకు సంబంధించినది కాదు. 'ఈ దేహంనాది' అని, 'ఇదినాది' అని నువ్వు వ్యావహారికదృష్టిలో చెప్పవలసివుంటుంది. కానీ నీ అంతరంగంలో నిజానికి 'ఇది నాది కాదు' అనే అవగాహన ఉండాలి. ఏవ్యక్తి అయినా ఇటువంటి వివేకపూర్వక జ్ఞానాన్ని సంతరించుకున్నట్లయితే ఏ విషయమూ అతనిని బాధించదు. వ్యవహార దృష్టిలో 'నేను చందూలాల్' అని, 'ఇదినాది' అని చెప్పటంలో తప్పులేదు గానీ లోలోపల నిజానికి నీవెవరివో, నిజంగా నీది ఏమిటో నీకు నిశ్చయాత్మకంగా తెలిసివుండాలి. ఒకపోలీసు నీయింటికి వచ్చి 'ఇది ఎవరిఇల్లు' అని ప్రశ్నిస్తే 'ఇది నాయిల్లు' అని నీవు జవాబు చెప్పవలసి వుంటుంది. కానీ అంతరంగంలో 'ఇది నాయిల్లు కాదు' అనే ఎరుక ఉండాలి. ఈ అంతరంగ జ్ఞానమే అశాంతిని తొలగించి శాంతికి, ఆనందానికి హేతువు అవుతుంది. అంతరంగంయొక్కస్థితి ఈ జ్ఞానంపై ఆధారపడివుంది. నిజమైన 'నేను' కు ఏ సంపత్తి లేదు.

'నాది' అనాత్మ విభాగానికి చెందినది, అశాశ్వతమైనది. 'నేను' ఆత్మవిభాగానికి చెందినది, శాశ్వతమైనది. 'నేను' ఎన్నటికీ అశాశ్వతం కాజాలదు. అందువలన 'నేను', 'నాది' అనే రెంటిలో నీవు అనుసరించవలసినది, లక్షింపదగినది 'నేను' నే.

# 'నేను' మరియు 'నాది' వేరు చేయి

'నేను' మరియు 'నాది' వీటిని ఒక విభాగినిద్వారా విభజించమని నేను నీకు చెప్పినచో నీవు ఆపని చేయగలవా? వీటిని వేరుచేయటం ముఖ్యమని నీకు అన్పించటంలేదా? కొంచెం ముందో వెనుకో దీనిని నీవు తెలుసుకోవలసిందే. పెరుగు నుంచి వెన్నను వేరు చేయటానికి ఒక పద్ధతి ఉన్నట్లే 'నాది' మరియు 'నేను' ను వేరుచేయటానికి కూడ ఒక మార్గం వుంది.

ఈ క్షణంలో నీ వద్ద 'నాది' అని పేర్కొనబడేవి ఏవైనా ఉన్నాయా? 'నేను' మాత్రమే వున్నదా? లేక 'నేను' తో పాటు 'నాది' కూడ ఉన్నదా?

ప్రశ్నకర్త : 'నాది' అనేది అన్నివేళలా వుంది.

దాదాశ్రీ : 'నాది' అనబడే వస్తువులు ఏమేమి వున్నాయి నీవద్ద ?

ప్రశ్నకర్త : 'నాయిల్లు' మరియు ఇంట్లోని అన్ని వస్తువులు.

దాదాశ్రీ : అవి అన్నీ నీవేనా? మరి భార్యఎవరిది?

ప్రశ్నకర్త : ఆమె కూడ నాదే.

దాదాశ్రీ : మరి ఈ పిల్లలో ?

ప్రశ్నకర్త : వాళ్ళుకూడా నావారే.

దాదాశ్రీ : మరి ఈ వాచ్?

ప్రశ్నకర్త : అది కూడ నాదే.

దాదాశ్రీ : మరి ఈ చేతులు, ఇవిఎవరి చేతులు?

ప్రశ్నకర్త : అవి కూడా నావే.

దాదాశ్రీ : నాతల, నా శరీరం, నాపాదాలు, నా చెవులు, నాకళ్ళు అని చెప్తావు కదా! ఈ నీ శరీర భాగాలన్నీ 'నాది' అనే విభాగంలోకి వస్తాయి. 'నాది' అని చెప్పే ఆవ్యక్తి ఎవరు? 'నాపేరు చందూలాల్' అని చెప్పినపుడు 'నేను చందూలాల్' అని చెప్పినపుడు రెండూ పరస్పర విరుద్ధంగా ఉన్నాయని నీకు అన్పిస్తుందా?

ప్రశ్నకర్త : అవును, విరుద్ధంగా ఉన్నట్లుతోస్తుంది.

దాదాశ్రీ : ఇపుడు నీవు చందూలాల్. ఈ చందూలాల్ లో 'నేను', 'నాది' అనేవి రెండూవున్నాయి. అవి రెండూ రైల్వేలైన్ల వంటివి; అవి సదా సమాంతరంగా వుంటాయే తప్ప ఎప్పటికీ ఒక్కటికావు. 'నేను', 'నాది' అనేవి కలిసి ప్రయాణిస్తాయే కానీ సదా వేరుగానే వుంటాయి. అయినప్పటికీ ఆరెంటినీ నీవు ఒకటే అని నమ్ముతున్నావు. దీనికి కారణం అజ్ఞానం లేదా నీ నిజమైన గుర్తింపు (Identity) నీకు తెలియకపోవటమే. దీనిని అర్థంచేసికొని 'నాది' అని చెప్పబడే వానినన్నింటిని వేరుచేసి ఒక ప్రక్కన పెట్టు. ఉదాహరణకి 'నాగుండె', నీ గుండెను ఒక ప్రక్కన పెట్టు. ఇంకా ఏఏ భాగాలను ఈ శరీరం నుంచి మనం వేరు చేయవలసి వున్నది?

ప్రశ్నకర్త : పాదాలు మరియు అన్ని జ్ఞానేంద్రియాలు.

దాదాశ్రీ : అవును, పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు, ఇంకా మిగిలినవన్నీ. 'నామైండ్' అంటావా లేక 'నేనుమైండ్' అంటావా?

ప్రశ్నకర్త : 'నామైండ్' అనే అంటాము.

దాదాశ్రీ : 'నా బుద్ధి' అని కూడ అంటావు కదా!

ప్రశ్నకర్త : అవును.

దాదాశ్రీ : మరి 'నా చిత్తం' అంటావా?

ప్రశ్నకర్త : అవును.

దాదాశ్రీ : 'నా అహంకారం' అంటావా లేక 'నేను అహంకారం' అంటావా?

ప్రశ్నకర్త : 'నా అహంకారం' అంటాము.

దాదాశ్రీ : 'నా అహంకారం' అనటంవల్ల అహంకారం కూడ నీ కంటె వేరని, దానిని నీ నుంచి వేరు చేయవచ్చని తెలుస్తుంది కదా! ఇవి కాక ఇంకా ఏఏ భాగాలు 'నాది' అని చెప్పబడేవి వున్నాయో నీకు తెలియదు. కనుక నీవు పూర్ణరూపంలో సెపరేషన్ చేయలేకపోతున్నావు. నీ జ్ఞానము పరిమితమైనది. స్థూల భాగాలు మాత్రమే నీకు

తెలుసు. సూక్ష్మ భాగాలను కూడ వేరుచేయాలి. తర్వాత సూక్ష్మతర, సూక్ష్మతమ భాగాలను కూడ వేరు చేయాలి. అగ్రాహ్యమైన ఈ స్థాయిలలోని భాగాలను వేరుచేయటం జ్ఞానిపురుషునికి మాత్రమే సాధ్యమౌతుంది.

'నేను' నుంచి 'నాది' అని పేర్కొనబడే ప్రతి స్పేర్‌పార్ట్‌ని వేరుచేస్తూ వాటినన్నింటిని ఒక ప్రక్కన పెట్టటం ద్వారా 'నేను' నుంచి 'నాది' వేరు చేయటం సాధ్యమే కదా! అలా 'నాది' అనే వాటినన్నింటిని వేరు చేసిన తర్వాత ఏమి మిగులుతుంది?

ప్రశ్నకర్త : 'నేను.'

దాదాశ్రీ : ఆ 'నేను' అనేది ఏదో అదే నువ్వు. ఆ 'నేను' నే నీవుతెలుసుకోవలసి వుంది.

ప్రశ్నకర్త : ఆ విధంగా సెపరేట్ చేసిన తర్వాత ఏది మిగిలి ఉంటుందో అదే నిజమైన 'నేను' అని అర్థం చేసుకోవాలా?

దాదాశ్రీ : అవును, ఆ సెపరేషన్ తర్వాత ఏమి మిగిలిఉంటుందో అదే నీ నిజమైన ఆత్మ. ఆ ఆత్మే 'నేను' అనబడే నిజమైన నువ్వు. దీనిని గురించి నీవు విచారించవలసి లేదా? 'నాది' నుంచి 'నేను' ను వేరుచేసే ఈ పద్ధతి చాలా సరళమైనది కదూ!

ప్రశ్నకర్త : సరళంగా కన్పిస్తుంది కానీ సూక్ష్మతర, సూక్ష్మతమ స్థాయిల్లో మేము ఎలా వేరుచేయగలం? జ్ఞాని లేకుండా ఇది సాధ్యం కాదు అవునా?

దాదాశ్రీ : అవును, మీ కోసం జ్ఞానిపురుషుడు ఆ పని చేస్తాడు. అందువల్లనే జ్ఞానియొక్క సెపరేటర్ ద్వారా 'నేను', 'నాది' వేరుచేయాలని చెప్తున్నాను. ఈ సెపరేటర్‌ని వేదశాస్త్రాలు లేదా ధర్మగ్రంధాలు ఏమని చెప్తున్నాయి? శాస్త్రాలు దానిని భేదజ్ఞానమని చెప్తున్నాయి. ఇది విభజన గురించిన విజ్ఞానము. భేదజ్ఞానం లేకుండా 'నాది' అనబడే వాటిని నీవు ఎలా విభజించగలవు? 'నాది' అనే విభాగంలోకి ఏవేవి వస్తాయో, 'నేను' అనే విభాగంలోకి ఏమి వస్తాయో నీకు సరైన అవగాహనలేదు. భేదజ్ఞానం అంటే 'నాది' అనే వాటి అన్నింటికంటె 'నేను' పూర్తిగా వేరు అని తెలిపే జ్ఞానం. ఎవరైనా సరే జ్ఞానిపురుషుని ప్రత్యక్షంగా కల్సుకోవటం ద్వారా మాత్రమే ఈ భేద జ్ఞానాన్ని పొందగలరు.

ఒకసారి 'నేను', 'నాది' అనే వాటి విభజనజరిగితే ఇది చాలా సులువు అవునా? ఈ మార్గంలో ఆత్మానుభూతికి సంబంధించిన విజ్ఞానం సరళం అవుతుంది. అవునా? నేను చూపిన ఈ పద్ధతి ఆత్మజ్ఞానాభివృద్ధిని సులభతరం చేస్తుంది. లేకుంటే ఈ రోజుల్లో, ఈ కాలంలో ఎవరైనా శాస్త్రాలు చదివీ చదివీ అలసిపోతారే తప్ప ఆత్మానుభూతిని పొందలేరు.

ప్రశ్నకర్త : ఇదంతా గ్రహించటానికి మాకు మీవంటి వారి సహాయం అవసరం లేదా?

దాదాశ్రీ : అవును, అది చాలా అవసరం. జ్ఞాని పురుషులు చాలా అరుదుగా వుంటారు. వారిని కల్సుకోవటం ఇంకా చాలా చాలా అరుదు. అటువంటి అరుదైన జ్ఞాని పురుషుడు లభించినప్పుడు ఆ అవకాశాన్ని జారవిడవకుండా అతని నుంచి స్వస్వరూపానుభూతిని పొందాలి. దీనికై ఏ మూల్యమూ చెల్లించవలసిన పనిలేదు. దీని నిమిత్తం మీకు ఏమీ ఖర్చుకాదు. పైగా ఒక గంట సమయంలో జ్ఞాని మీకు ఈవిభజన చేసి యిస్తారు. ఒక సారి మీరు నిజమైన 'నేను' ను గురించిన జ్ఞానాన్ని పొందినచో, అన్నింటిని సాధించినట్లే. ఇది సమస్త శాస్త్రాల పూర్ణసారము.

నీవు ప్రాపంచిక విషయాలను కావాలనుకొంటే 'నాది' ని ఉంచుకోవాలి. కాని ముక్తిని పొందదల్చుకొన్నట్లయితే 'నాది' అనబడే వాటి అన్నింటిపై యాజమాన్యాన్ని త్యజించాలి లేదా వాటినన్నింటినీ మానసికంగా సమర్పణ చేయాలి. ఆ విధంగా 'నాది' అనేవాటినన్నింటిని జ్ఞానిపురుషునికి సమర్పించు. అపుడు నీకు 'నేను' మాత్రమే మిగిలివుంటుంది. 'నాది' పోయినప్పుడు 'నేనెవరిని' అనేది అనుభవపూర్వకంగా తెలుస్తుంది. 'నాది' వేరయితే అపుడు అంతా విభజింపబడినట్లే. 'నేను', 'ఇదంతానాది' అనే నమ్మకదశ జీవాత్మదశగా నిర్వచింపబడింది. ఒక వ్యక్తి ఈ నమ్మకంతో (స్వస్వరూపానుభూతికిముందు) జీవాత్మగా ఉంటాడు. ఆత్మజ్ఞానప్రాప్తి తర్వాత జ్ఞానఫలంగా ఆ వ్యక్తి 'నేను మాత్రమే ఉన్నాను'; 'ఏదీ నాది కాదు, ఇదంతా నాదికాదు' అనే అవగాహనపూర్వకమైన నమ్మకంతో పరమాత్మ దశను పొందుతాడు. 'నాది' అనే ప్రతివస్తువూ మోక్షమార్గంలో అవరోధము. 'నేను' నుంచి 'నాది' ఒకసారి వేరయితే

మార్గం క్లియర్ అవుతుంది. 'నాది' ని వేరుచేయటం వల్ల లేదా 'నాది' వినష్టం అవ్వటం వల్ల 'నేనుఎవరు?' అనే అనుభూతి తనంత తానుగా అత్యంత సహజంగా కల్గుతుంది. స్వరూపానుభూతి 'నాది' యొక్క వినష్టంపై లేదా విభజనపై ఆధారపడివుంది.

## (4) విశ్వానికి బాస్ ఎవరు?

## జ్ఞాని మాత్రమే నిజమైన 'నేను' ను చూపగలడు

ప్రశ్నకర్త : ఈ సంసార జీవనం సాగిస్తూ నిజమైన 'నేను' ను గ్రహించటం మరియు అనుభూతి చెందటం ఎలా సాధ్యమవుతుంది?

దాదాశ్రీ : మరి, వేరే ఎక్కడకు వెళ్ళి నిజమైన 'నేను' ను గుర్తిస్తావు? ఈ ప్రపంచం కాకుండా వేరే ఏదైనా చోటు ఉన్నదా జీవించటానికి? ప్రపంచంలోని ప్రతిఒక్కరూ ఇందులోనే జీవించాలి. ఈ ప్రపంచంలో ఇక్కడే నీవు నీ నిజస్వరూపాన్ని తెల్సుకోగలవు. 'నేనెవరిని?' ఇది గ్రహించవలసిన విజ్ఞానము. నావద్దకురండి, నేను మీ నిజస్వరూపాన్ని మీకు అనుభూతం చేస్తాను.

దీనిని తెలుసుకొనే విధానంలో నేను మిమ్మల్ని ఏమీ చెయ్యమని చెప్పటంలేదు. అది మీ శక్తి పరిధిలోనిది కాదు కనుక. అందువల్ల నేనే మీకోసం అన్నీ చేస్తాను అని చెప్తున్నాను. మీరు దేని గురించి చింతించవలసిన పనిలేదు. మనం మొదట తెలుసుకొనవలసింది 'నిజంగా మనం ఎవరము?' అనే విషయాన్ని. శాశ్వత సత్యం ఏమిటి? ప్రపంచం ఏమిటి? ఇదంతా ఏమిటి? భగవంతుడంటే ఏమిటి లేదా భగవంతుడు ఎవరు ? ఈ విషయాలు తెలిసికొన యోగ్యమైనవి.

భగవంతుడున్నాడా? అవును భగవంతుడున్నాడు పైగా అతడు మీలోనే వున్నాడు. అతనికోసం మీరు బయట ఎందుకు వెదుకుతున్నారు? ఎవరైనా మీకోసం ఆ ద్వారాన్ని తెరిస్తే మీకు భగవంతుని దర్శనం అవుతుంది. ఆ తలుపులు చాలా గట్టిగా మూయబడివున్నాయి. అందువల్ల మీకు మీరుగా దానిని తెరవటం సాధ్యంకాదు. ఆత్మజ్ఞానిపురుషుడు మాత్రమే మీకు దారి చూపి ఆ ద్వారాన్ని మీకోసం తెరవగలడు.

# మీ తప్పులే మీకు యజమానిగా తయారవుతాయి.

మీలో ఉన్న ఆత్మయే భగవంతుడు. మీరు భగవత్స్వరూపమే. మీకంటె వేరుగా లేదా మీ పైన భగవంతుడు వేరే లేడు. నిన్ను నియమించే దైవీశక్తి ఏదీ లేదు. నీవు పూర్తి స్వతంత్రుడివి. నిన్ను గాయపరిచేవారుగాని నిరోధించేవారు గాని ఎవరూలేరు. నిన్ను గాయపరచగల్గింది లేదా నిరోధించగల్గింది నీ స్వయంకృతాపరాధములు మాత్రమే.

నీకు ఒక బాస్ లేకపోవటం మాత్రమే గాదు, నిన్ను బాధించగలవారు గానీ, నీ విషయంలో జోక్యం చేసికోగలవారుగానీ ఎవ్వరూలేరు. ఎన్నోరకాల జీవులు ఉన్నప్పటికీ వాటిలో ఏదీ నీతో జోక్యానికి రాదు. ఎవరు జోక్యం చేసికొంటున్నారో వారు నీ పూర్వకర్మఫలంగానే జోక్యం చేసుకుంటున్నారు. ఇంతకు పూర్వము నీవు ఇతరుల విషయాలలో జోక్యం చేసికొన్నదానికి ఫలమే ఇపుడు నీవు అనుభవిస్తున్నావు. నేను దీనిని జ్ఞానదృష్టితో దర్శించి చూచినది చూచినట్లుగా చెప్తున్నాను.

ఈ క్రింది రెండు వాక్యాలలో నేను మనిషి మోక్షానికి గ్యారంటీయిస్తున్నాను. అవి ఏమంటే :

" ఈ ప్రపంచంలో నీకు ఎవరూ బాస్‌లేరు. నీ బ్లండర్స్ మరియు మిస్టేక్స్ మాత్రమే నీకు బాస్. ఇవి రెండూ లేని పక్షంలో నీవే పరమాత్మవు."

మరియు

"నీతో ఏవిషయంలోనైనా జోక్యం చేసికోగల వారు ఎవ్వరూలేరు. ఈ జగత్తు ఎంత నియమబద్ధమైనదంటే ఏ జీవీ ఇంకొక జీవితో జోక్యం చేసికొన శక్తి గల్గిలేదు."

ఈ రెండు వాక్యాలు మీ అభిప్రాయభేదాలను, ఘర్షణలను తొలగించి మీకు శాంతిని, సహజీవనాన్ని చేకూర్చగలవు.

# (5) జగత్తులో కర్త ఎవరు?
# ఈ జగత్తులో కర్తయొక్క యదార్థ స్వభావము

సత్యాన్ని గురించిన జ్ఞానం లేకపోవటమే ఈ ఆవరణ, అస్పష్టత, ఆందోళన, కలతల కన్నింటికీ కారణం. ఇంతవరకూ మీకు తెలిసిన వాటిని గురించే ఇపుడు కూడ మీరు తెల్సుకోగోరుతున్నారా లేక మీకు తెలియనిదానిని తెలియగోరుతున్నారా?

ప్రపంచం ఏమిటి? ఇది ఎలా ఏర్పడింది? దీని సృష్టికర్త ఎవరు? ఈ జగత్తులోని ప్రతి ఒక్కరితో మనకు గల పాత్ర, సంబంధము ఏమిటి? దేనికైనా కర్తను నేనేనా? లేక వేరే ఎవరైనా కర్త ఉన్నారా? ఈ ప్రశ్నలన్నింటికీ సమాధానం తెల్సుకోవలసిన ప్రాముఖ్యత ఉన్నదా? లేదా?

ప్రశ్నకర్త : ఉంది.

దాదాశ్రీ : ముందుగా దేని గురించి తెలుసుకోవలసిన అవసరం ఉన్నదో దాని గురించి మాట్లాడుకొందాం. ఈ జగత్తును ఎవరు సృష్టించారని నీవు తలుస్తున్నావు? ఇంత సంక్లిష్టమైన, కష్టాలలో నిండిన ప్రపంచాన్ని ఎవరు సృష్టించారు? నీ అభిప్రాయం ఏమిటి?

ప్రశ్నకర్త : భగవంతుడే తప్పక దీనిని సృష్టించి ఉండొచ్చు.

దాదాశ్రీ : అయితే ప్రపంచం అంతా చింతలతో ఎందుకు నిండి వుంది? ప్రతి ఒక్కరికీ చింతలున్నాయి. వాటి నుంచి ఎవరూ ముక్తి పొందలేదు.

ప్రశ్నకర్త : అందరూ చింతిస్తుంటారు కనుక ప్రపంచం చింతలతోనిండివుంది.

దాదాశ్రీ : అవును. భగవంతుడు ఈ ప్రపంచాన్ని సృష్టించివుంటే చింతలతో కూడిన దానినిగా ఎందుకు సృష్టించాడు? ఇట్టి దు:ఖాలన్నింటినీ సృష్టించిన నేరం ఆయనదే అయితే ఆయనను మనం అరెస్టు చేయించాలి. వాస్తవానికి ఆ నేరం ఆయనది కాదు. భగవంతుడు నిర్దోషి, ప్రపంచానికి సృష్టికర్త భగవంతుడే అని చెప్పటంద్వారా ప్రజలు అతనిని నేరస్థుణ్ణి చేసారు.

వాస్తవానికి, భగవంతుడు ఈ ప్రపంచాన్ని ఎంతమాత్రము సృష్టించలేదు. సైంటిఫిక్ సర్కమ్‌స్టెన్షియల్ ఎవిడెన్స్ వల్లనే ప్రపంచం ఏర్పడింది. అందువల్ల ఇది స్వాభావికంగానే ఏర్పడింది. గుజరాతి భాషలో దీనిని నేను వ్యవస్థిత్ శక్తి (సైంటిఫిక్ సర్కమ్ స్టెన్షియల్ ఎవిడెన్స్) అని పేర్కొంటాను. ఇది చాలా సూక్ష్మ సత్యము.

## దీనిని మోక్షము అనటానికి వీలులేదు

ఒక చిన్నపిల్లవాడు కూడ భగవంతుడే ప్రపంచాన్ని తయారు చేసాడని చెప్తాడు. ఎంతో ఖ్యాతి గడించిన ధార్మికుడు లేదా సంత్ పురుషుడు కూడ భగవంతుడే ఈ ప్రపంచాన్ని సృష్టించాడని చెప్తాడు. ఇది లౌకికి దృష్టిమాత్రమే. ఇది అలౌకిక దృష్టి లేదా సత్యదృష్టి కాదు.

భగవంతుడు సృష్టికర్త అయినచో, అతడే మనకి శాశ్వతంగా బాస్ అయ్యేవాడు; అపుడు మోక్షం వంటిది ఏమీ ఉండేదికాదు. కానీ మోక్షంవుంది. భగవంతుడు ప్రపంచసృష్టికర్త కాదు. మోక్షం అంటే ఏమిటో గ్రహించిన వారు ఎవరైనా భగవంతుని సృష్టికర్తగా అంగీకరించరు. 'మోక్షము' మరియు 'భగవంతుడు సృష్టికర్త' ఇవి రెండూ పరస్పరవిరుద్ధమైన మాటలు. సృష్టికర్త అనగా, ఎవరు నీకు శాశ్వతమైన ఉపకారం చేసారో అతడు. అట్టి ఉపకారం చేసినది భగవంతుడే అయినచో నీవు ఎప్పటికీ అతనికి ఋణపడివుండాలి. సృష్టికర్తగా భగవంతుడు సదానీకు యజమానిగా (బాస్) ఉంటాడు; నీవు సదా అతనికి దాసునిగా (సబార్డినేట్‌గా) నే వుంటావు. నీవు మోక్షాన్ని పొందినప్పటికీ, అతను నీ పైఅధికారిగానే వుంటాడు. అవునా కాదా?

ప్రశ్నకర్త : అవును, అతడు శాశ్వతంగా మన పైఅధికారి అవుతాడు.

దాదాశ్రీ : అవును. అతడు మనకు శాశ్వతంగా బాస్ అవుతాడు కాబట్టి మోక్షం అనేదే లేదు. మన పైన ఒక అధికారివున్నపుడు ఆ మోక్షం మోక్షం అన్పించుకోదు. అటువంటి మోక్షంకంటె ఒకామెకు భర్తగా వుండటం మేలు. కొన్ని సమయాలలో అవమానించినా కనీసం నీకు వంటయినా చేసిపెడ్తుంది. అవసర సమయంలో సేవచేస్తుంది.

## అయితే భగవంతుణ్ణి ఎవరు తయారు చేసారు?

భగవంతుడే నిజమైన సృష్టికర్త అని మేము చెప్పినట్లయితే భగవంతుణ్ణి ఎవరు తయారు చేసారు? అనే లాజికల్ ప్రశ్నవేస్తారు ప్రజలు. ఇంకా ఎన్నో ప్రశ్నలూ తలెత్తుతాయి. ప్రజలు నా వద్దకు వచ్చి ఇలా అంటారు. “భగవంతుడే కర్త అని మేము తలుస్తాము. కానీ అది సరికాదని మీరు చెప్తున్నారు. దీనిని అంగీకరించటం మాకు కష్టంగావుంది.'' అపుడు నేను “భగవంతుడే కర్త అని నేను అంగీకరించాలంటే, ఆ భగవంతుని ఎవరు తయారు చేసారు? భగవంతుని సృష్టించిన వాడిని ఎవరు సృష్టించారు? ఇంతమాత్రం నాకు చెప్పండి'' అని వాళ్లని అడుగుతాను. దీనిని తార్కికంగా విచారించి తెలుసుకోవచ్చు. సృష్టికర్త ఒకరు ఉన్నట్లయితే ఆ సృష్టికర్తను సృష్టించిన సృష్టికర్త వేరొకరు ఉండాలి. ఇక దీనికి అంతం అనేదే వుండదు. అందువల్ల ఇది నిజం కాదు.

## జగత్తుకు ఆదిగానీ అంతంగానీ లేదు.

ఎవరూ సృష్టించకుండానే ఈ జగత్తు ఏర్పడింది. దీనిని ఎవరూ సృష్టించలేదు. ఎవరూ దీనిని సృష్టించలేదు గనుక దీనిగురించి మనం ఎవరిని అడగగలం ? ఇంత అస్తవ్యస్తంగా దీనిని సృష్టించిన వారెవరు? దీనికి బాధ్యులెవరు? అని తెల్సుకోవాలని నేనూ అన్వేషిస్తున్నాను. ఆవ్యక్తి కోసం ప్రతిచోటా నేను వెదికాను, కానీ ఎక్కడా కన్పించలేదు.

భగవంతుడు ఈ జగత్తును సృష్టించాడనే వారిని తమ వాదనను ఋజువు పర్చుకోవటం కోసం నాతో చర్చలు జరపమని విదేశీ శాస్త్రవేత్తలకు చెప్పాను. అతడు సృష్టికర్త అయినచో ఏ సంవత్సరంలో దానిని సృష్టించాడో చెప్పమని నేను వారిని అడిగాను. ఏ సంవత్సరమో తమకు తెలియదని వారు అన్నారు. “అయితే ప్రపంచం మొదలు అనేది అయిందా'' అని అడిగాను. అప్పుడు వారు “మొదలు అయింది'' అని చెప్పారు. సృష్టికర్త ఒకరున్నట్లయితే ఆ సృష్టికి మొదలు ఉండి తీరాలి. మొదలు అనేది ఉన్నట్లయితే దానికి అంతం అనేది కూడ ఉండి తీరాలి. కానీ వాస్తవానికి ఈ జగత్తు అనాది-అనంతము. జగత్తు అంతం లేకుండానే కొనసాగుతుంది. అందువల్ల దానికి ఆదీ అంతమూ లేదు. దేనికి ఆదిలేదో దానికి సృష్టికర్తకూడ లేడు.

# భగవంతుని నిజమైన చిరునామా

అపుడు ఈ శాస్త్రవేత్తలు నన్ను 'దీని అర్థం భగవంతుడు లేడు అనేనా?' అని అడిగారు. భగవంతుడు లేనట్లయితే ప్రపంచంలో ఎవరికీ సుఖం యొక్క గానీ, దుఃఖం యొక్కగానీ అనుభూతి కల్గదు. కనుక భగవంతుడు తప్పక ఉన్నాడని నేను వారితో చెప్పాను. భగవంతుడెక్కడ ఉన్నాడని వారు ప్రశ్నించారు. అతడు ఎక్కడెక్కడున్నాడని మీరు తలుస్తున్నారని నేను వారిని అడిగాను. వారు ఆకాశంవైపు తమ చేతిని చూపించారు. ఆయనపైన ఎక్కడుంటాడు? సరైన చిరునామా ఏమిటి? ఆయనకు లెటర్ పంపటం సాధ్యపడుతుందా? అనే నా ప్రశ్నలకు తమకు తెలియదని వారు సమాధానం చెప్పారు. నేను వారితో ఇలా చెప్పాను. వాస్తవానికి పైన ఎవ్వరూ లేరు. పైన భగవంతుడుంటాడని అందరూ చెప్తుంటారు కనుక నేను స్వయంగా అక్కడకు వెళ్ళి తనిఖీచేసాను. అక్కడ భగవంతునికోసం అన్వేషించాను కానీ విశాలమైన ఆకాశం తప్ప అక్కడ ఎవరూలేరు. అక్కడ ఎవరూ నివసించటంలేదు. శాస్త్రవేత్తలు భగవంతుని సరియైన చిరునామా నన్ను అడిగినప్పుడు నేను వారిని ఇలా వ్రాసుకోమని చెప్పాను:

“దృశ్యమూ, అదృశ్యమూ అయిన ప్రతి ప్రాణిలోనూ భగవంతుడున్నాడు. కానీ మానవుడు సృష్టించిన వాటిలో లేడు.

ఈ టేపురికార్డర్ మానవునిచే సృజింపబడినది. మానవుడు తయారుచేసిన ఏ వస్తువుల్లోనూ భగవంతుడుండడు. స్వాభావికంగా సృష్టింపబడిన అన్నింటిలోనూ భగవంతుడున్నాడు. స్థూలమైన మరియు సూక్ష్మమైన ప్రతిజీవిలోనూ భగవంతుడు విరాజమానుడై ఉన్నాడు. నీకూ నాకూ మధ్య మైక్రోస్కోపు ద్వారా కూడ చూడ సాధ్యంకాని అసంఖ్యాకమైన సూక్ష్మజీవులున్నాయి. వాటిఅన్నింటిలో భగవంతుడు వసిస్తున్నాడు. భగవంతుడు ఏమి చేస్తాడు? అతడు ప్రతిప్రాణికీ కేవలం ప్రకాశాన్నిస్తాడు. ఆ ప్రకాశాన్ని ఏవిధంగా ఉపయోగించుకోవాలనేది వారివారి వ్యక్తిగతం. దానధర్మాలు చేయటం వంటి సత్కర్మలు చేసినా లేక వంచన, దొంగతనంవంటి చెడ్డపనులు చేసినా ఎవరు చేసిన కర్మకు వారే బాధ్యులు. భగవత్ప్రకాశాన్ని దేనికోసం ఉపయోగించు కోవాలన్నా నీకు పూర్తి స్వేచ్ఛవుంది.

భగవంతుడెక్కడోపైన ఉన్నాడని నీవు కూడ నమ్ముతున్నావు. అవునా? పైన ఎవరూ లేరు. పైన ఎవరో ఉన్నారనేది నీ మూఢనమ్మకము. ఇవి అన్నీ రాంగ్ బిలీఫ్స్ అని తెలియజేయటం కోసమే నేను వచ్చాను; ఈ విషయాన్ని బహిరంగంగా ప్రకటించకపోతే మీ తప్పుడు నమ్మకములు మరియు భ్రమ అలాగేవుండిపోతాయి. పారంపర్యంగా సంక్రమించిన నమ్మకాలు అంతంకావటం జరగదు.

## ప్రపంచం దానికదే చిక్కుప్రశ్న

ప్రపంచం దానంతట అదే చిక్కుప్రశ్నగా తయారైంది. భగవంతుడు దానిని సృష్టించలేదు. ఈ పజిల్‌ను భగవంతుడు సృష్టించివుంటే ప్రపంచంలోని బాధలన్నింటికి భగవంతుడినే మనం బాధ్యునిగా చేయగలిగే వాళ్లం. ప్రజలందరికీ ఎందుకు బాధలు కల్గిస్తున్నావని అతడిని నిలదీసేవాళ్లం. కానీ ఈ పజిల్‌ను భగవంతుడు సృష్టించలేదు. భగవంతుడు కేవలం భగవంతుడే; భగవంతుడంటే శాశ్వతబ్రహ్మానందస్థితి. మన అజ్ఞానంవల్ల భగవంతునిపై నేరంమోపి చాలా పొరపాటు చేస్తున్నాము. దాని కారణంగానే ప్రపంచం దానికదే చిక్కుముడిగా తయారైంది. ఎవరుగానీ ఈ పజిల్‌ను సృష్టించలేదు.

ఇప్పుడెవరైనా 'చందులాల్‌కి బుద్ధిలేదు' అని అన్నట్లయితే అదినిన్ను కలవరపెడుతుందా లేదా?

ప్రశ్నకర్త : అవును.

దాదాశ్రీ : ఎవరైనా నన్ను ఇప్పటికిప్పుడు అవమానపరచినా అదినన్ను కలవరపెట్టదు; కానీ అదే నీవిషయంలో అయితే నీకు కలతకల్గుతుంది. ఎందువల్లనంటే నీవు బందీవై వున్నావు. అజ్ఞానమనే త్రాళ్లు నిన్ను బంధించినాయి.

ప్రశ్నకర్త : మరి దీని గురించి మాకు పరిష్కారం ఎలా లభిస్తుంది?.

దాదాశ్రీ : రెండు దృష్టికోణాలలో ఈ పజిల్‌ని పరిష్కరించవచ్చు : ఒకటి లౌకిక దృష్టికోణం, మరిఒకటి అలౌకిక దృష్టికోణం. అలౌకికం శాశ్వతమైనది. లౌకికం తాత్కాలికమైనది. ఈ బంధువులంతా తాత్కాలికమైన సర్దుబాట్లు. కానీ నీవు శాశ్వతుడవు. శాశ్వతమైనది ఏదో, ఒకసారి నీవు కనుగొన్నట్లయితే ఈ చిక్కుప్రశ్న పరిష్కారమవుతుంది. కలవరపాటు తొలగుతుంది. దైవాన్ని అన్వేషించే ఈ సాధువులు

మరియు ప్రజలు అందరూ ఈ పజిల్‌ను విడదీయలేకపోయారు పైగా వారే దానిలో చిక్కుకొన్నారు. ఈ చిక్కుముడిని విప్పటంలో నేనుమీకు సహాయపడగలను. ఒకే ఒకగంట సమయంలో నేను మీకోసం ఆపనిచేయగలను. ఆ తర్వాత ఈ చిక్కుప్రశ్న మరల తలెత్తదు.

ఈ జగత్తును ఉన్నదానిని ఉన్నట్లుగా అర్థంచేసికోవటం మాత్రమే నీవు చేయవలసింది; ఆ తర్వాత, నీవు జ్ఞప్తిలో ఉంచుకోవలసినది కూడ ఏమీ లేదు. ఒకసారి అర్థం చేసికొంటే చాలు. ఈ జగత్తు ఎలా ఏర్పడింది? భగవంతుడెవరు? జగత్తును ఎవరు నడిపిస్తున్నారు? ఇదంతా ఏమిటి? మన నిజస్వరూపం ఏమిటి? ఈ ప్రశ్నలన్నింటికి సమాధానం తెలుసుకోవటంవలన ఈ చిక్కు ముడులన్నీ శాశ్వతంగా విడిపోతాయి.

## సైంటిఫిక్ సర్కమ్‌స్టెన్షియల్ ఎవిడెన్స్

మనం ఈ విషయాన్నిగురించి చర్చిద్దాం. నీవు అడగదల్చుకొన్న ప్రశ్నలు ఏవైనా సరే అడిగి సమాధానాలు పొందవచ్చు.

ప్రశ్నకర్త : సైంటిఫిక్ సర్కమ్‌స్టెన్షియల్ ఎవిడెన్స్ అంటే ఏమిటో నాకు అర్థం కాలేదు.

దాదాశ్రీ : దీని కంతటికీ ఆధారం ఈ సైంటిఫిక్ సర్కమ్‌స్టెన్షియల్ ఎవిడెన్స్. అదిలేకుండా ఈ జగత్తులో ఒక్క పరమాణువు కూడ మార్పు చెందలేదు. నీవు భోజనానికి కూర్చోవటానికి ముందు ఏఏపదార్థాలను వడ్డించబోతున్నారో నీకు తెలుసా? భోజన పదార్థాలను తయారు చేసే వ్యక్తికి కూడ రేపు ఆమె/అతను ఏమి తయారు చేయబోతున్నారో తెలియదు. నీవు ఎంత ఆహారం తినవలసి ఉన్నదోకూడ పరమాణువు స్థాయివరకు అంతా నిర్ణయింపబడివుంటుంది. వీటి నన్నింటినీ ఒక చోట చేర్చి అది జరిగేలా చేసేది ఎవరు? అదే వ్యవస్థిత్ శక్తిగా నేను పేర్కొనే సైంటిఫిక్ సర్కమ్‌స్టెన్షియల్ ఎవిడెన్స్ అనే ఒక అద్భుతము.

ఇప్పుడు మన యిద్దరి మధ్య కలయికకు ఆధారం ఏమిటి? సైంటిఫిక్ సర్కమ్‌స్టెన్షియల్ ఎవిడెన్సెస్ పై మాత్రమే మన కలయిక ఆధారపడివుంది. ఈ కలయిక

వెనుక తెల్సికొన శక్యంకాని చాలా సూక్ష్మమైన కారణాలు వున్నాయి. ఆ కారణాలు ఏమిటో కనిపెట్టు.

ప్రశ్నకర్త : వాటిని ఎలా కనుక్కోగలం?

దాదాశ్రీ : నీవు యిక్కడికి సత్సంగానికి వచ్చినపుడు 'నేను ఈరోజు యిక్కడికి వచ్చాను' అని నమ్మావు. 'నేను వచ్చాను' మరియు 'నేను వెళ్తున్నాను' అని నీవు చెప్పటం నీ రాంగ్ బిలీఫ్ మరియు అహంకారం. నిన్న ఎందుకురాలేదని నిన్ను నేను ప్రశ్నిస్తే నీవు నీ కాళ్లపైపు చూపించవచ్చు. దీనిని నేనేమని అర్థం చేసికోవాలి?

ప్రశ్నకర్త : నా కాళ్ళు నొప్పిపెడ్తున్నాయి అని.

దాదాశ్రీ : అవును, నీ కాళ్ళు నొప్పిగా ఉన్నాయి. నీవు నీకాళ్ళను నిందిస్తావు. నీకాళ్ళు నొప్పిగావున్నట్లయితే నీ కాళ్ళు నిన్ను ఇక్కడకు తెచ్చాయా? లేక నీ అంతట నీవే యిక్కడకు వచ్చావా?

ప్రశ్నకర్త : యిక్కడకు రావాలనే కోరిక నాకు ఉన్నది. కాబట్టి నేను యిక్కడ ఉన్నాను.

దాదాశ్రీ : అవును. నీ కోరిక కారణంగానే నీవువచ్చావు. కానీ నీ కాళ్ళు ఇంకా మిగిలినవన్నీ బాగున్నాయి కనుకనే నీవు యిక్కడికి రాగలిగావు. నీ కాళ్ళు బాగా పనిచేయకుంటే నీవు రాగలిగేవాడివా?.

ప్రశ్నకర్త : అపుడు రాలేక పోయేవాడిని.

దాదాశ్రీ : మరి అపుడు నీవు స్వశక్తితో రాగలిగినట్లా? ఉదాహరణకి పక్షవాతంతో ఉన్న వ్యక్తి ఒకరు ఎద్దుల బండిలో ఇక్కడకు వచ్చాడనుకో. అతడు "నేను వచ్చాను" అని చెప్తాడు. 'నీ కాళ్లు పక్షవాతానికి గురైనాయి కదా నీవు యిక్కడకు ఎలా వచ్చావు?' అని మేము అడిగినప్పటికీ అతడు తాను వచ్చాననే గట్టిగా చెప్తాడు. కానీ నేను అతనిని 'నీవే వచ్చావా? లేక బండి నిన్ను యిక్కడకు తీసికొచ్చిందా?' అని అడిగినట్లయితే బండి తనను తీసికొనివచ్చిందని చెప్తాడు. అపుడు నేను అతనిని 'బండి ఇక్కడకు వచ్చిందా లేక ఎద్దులు బండిని యిక్కడకు తెచ్చాయా?' అని ప్రశ్నిస్తాను.

అందువల్ల, మీ నమ్మకాలన్నీ సత్యదూరమైనవే. నీవుయిక్కడకు రాగలగటం ఎన్నో భిన్నపరిస్థితులపై ఆధారపడివుంది. ఎన్నో పరిస్థితులు నీకు సరైనక్రమంలో అనుకూలించినపుడే నీవు యిక్కడకు రాగలవు.

నీవు సరైన సమయంలో ఇక్కడకు వచ్చినప్పటికీ నీకు తలనొప్పి వస్తే వెనక్కి వెళ్ళవలసి రావచ్చు. నీవు నిజంగా స్వతంత్రంగా యిక్కడకు నీ యిష్టంతో వచ్చినపుడు నీ తలనొప్పి నీకు ఆటంకం కాకూడదుకదూ! లేదంటే నీవు యిక్కడకు వస్తుండగా దారిలో నీ స్నేహితుడు కల్సి అతనితో రమ్మని నిన్ను బలవంతం చేస్తే నీవు వెనక్కి వెళ్ళిపోవచ్చు. అందువల్ల ఎన్నో పరిస్థితులు అనుకూలిస్తేనే గాని ఒక పని జరగదు. ఏవిధమైన అవరోధాలు లేకుంటేనే నీవు యిక్కడకు రాగలవు.

## మనస్సుకి అనుకూలించే సిద్ధాంతం

ఎన్నో పరిస్థితులు అనుకూలించినపుడు మాత్రమే ఒక కార్యం పూర్తవుతుంది. సైంటిఫిక్ సర్కమ్‌స్టెన్షియల్ ఎవిడెన్సెస్ వల్లనే ఆ పని జరిగింది. కానీ నీవు అహంకారంతో 'నేను చేసాను' అని ఆ గొప్పతనాన్ని నీకు ఆపాదించుకొంటావు. అంతా సవ్యంగా జరిగితే 'నేను చేసాను' అని, అనుకొన్న ప్రకారం జరగకపోతే దురదృష్టం అని చెప్తావు లేదా ఇతరులను నిందిస్తావు.

ప్రశ్నకర్త : అవును.

దాదాశ్రీ : డబ్బు సంపాదించినపుడు మనిషి అది తనఘనత అని గర్వపడతాడు. కానీ నష్టం వచ్చినపుడు లేదా విఫలమైనపుడు ఏవో కారణాలు చెప్తాడు లేదా 'భగవంతుడు నాకు అనుకూలించలేదు' అంటాడు.

ప్రశ్నకర్త : ఇది సులభమయిన క్షమాపణ, అనుకూల సిద్ధాంతము.

దాదాశ్రీ : అవును అనుకూలమే కావచ్చు. కానీ ఏవిషయంలోనూ ఎవ్వరూ భగవంతునిపై నేరం మోపకూడదు. మనం ఒక లాయర్‌ని గాని లేక మరెవరినైనా నిందిస్తే కొంతవరకు ఫర్వాలేదు కాని మనం భగవంతుని ఎలా నిందించగలం? లాయర్‌ని నిందిస్తే అతడు నీపై కేసుపెట్టి నష్టపరిహారం కోరతాడు, కానీ భగవంతుని

నిందిస్తే ఆకేసు ఎవరు పెట్టాలి? ఇటువంటి నేరారోపణలు మరుజన్మలో భయంకరమైన బంధాలకు కారణమౌతాయి. భగవంతుని ఎవరైనా నిందించగలరా?

ప్రశ్నకర్త : లేదు.

దాదాశ్రీ : కొన్ని సందర్భాలలో ప్రజలు తమ పొరపాటును, తప్పులను ఒప్పుకోకుండా రకరకాల కారణాలను చెప్తుంటారు. మనిషెన్నడూ తన తప్పులను తాను అంగీకరించడు. గ్రహాలు అనుకూలంగా లేవు, భాగస్వామి మోసం చేసాడు. ఇలాంటి వంకలు చెప్తారే తప్ప దోషాన్ని తమ నెత్తిపై వేసుకోరు. ఒకసారి ఒక విదేశీయుడు నాతో 'మీ భారతీయులు నేరాన్ని తమపై వేసికోరెందుకు?' అన్నాడు. అపుడు నేను 'అదే ఇండియన్ పజిల్. అన్ని పజిల్స్ కంటే పెద్దది' అన్నాను. 'భారతీయులు తమ తప్పుని ఒప్పుకోరు, అదే విదేశీయులైతే చాలా హుందాగా తమ తప్పులను అంగీకరిస్తారు' అన్నాను.

## కర్తృత్వంలో విరుద్ధత

సంయోగం (పరిస్థితులన్నీ సమకూడటం) దానంతట అదే జరుగుతుంది. అలాగే వియోగం (పరిస్థితులు సమకూడకపోవటం) కూడ. కానీ అన్నీ సవ్యంగా వుంటే 'నేను చేసాను' అని మనిషి గర్వపడతాడు. ఏదైనా నష్టంవస్తే విశ్వాసాన్ని కోల్పోయి 'నేను ఏమి చేయగలను?' అంటాడు.

ప్రశ్నకర్త : అవును. కొన్నిసార్లు నేనూ అలాగే చెప్తాను.

దాదాశ్రీ : నీవు 'కర్తవు' అయినపుడు 'నేనేమి చేయగలను?' అని ఎన్నడూ అనవు. ఉదాహరణకి ఏదైనావంట బాగాకుదిరిందని, రుచిగావుందని తిన్నవాళ్లు చెప్తే 'నేనే చేసాను' అని దానిని చేసిన వారు గర్వపడతారు. కానీ ఆ పదార్థం రుచిగా లేకపోవటమో, మాడిపోవటమో జరిగితే 'నేనేమి చేయను? పిల్లలు విసిగిస్తున్నారు, ఫోను అదే పనిగా మ్రోగుతూఉంది, స్టౌమంట ఎక్కువైంది' ఇలా ఎన్నో సాకులు చెప్తారు. అందరూ ఇలాగే మాట్లాడుతుంటారు. ఒకరోగి అనారోగ్యం నుంచి కోలుకుంటే అతనికి వైద్యం చేసిన డాక్టరు 'నేను ఇతని ప్రాణాలు కాపాడాను' అంటాడు. రోగి చనిపోతే 'నేనేమి చేయను?' అంటాడు. ఇలాంటి పొందికలేని, పునాదిలేని సమాధానాలు దేనికి ?

## నీవు నిద్రలేచావా? లేక ఎవరైనా లేపారా?

నువ్వు ఉదయాన్నే త్వరగా నిద్రలేచినప్పుడు 'నేనులేచాను' అని చెప్తావు. ఏ కారణం వల్ల నీవు త్వరగా లేవగలిగానని అనుకొంటున్నావు? రాత్రి సరిగా నిద్రపట్టకపోతే 'నాకు నిద్రపట్టలేదు' అని చెప్తావు. ఎందుకు నిద్రించలేక పోయావు? నిజానికి దేనిమీదా నీకు నియంత్రణలేదు.

'ఉదయం నన్ను ఎవరు నిద్రలేపారు?' అని ఎవరైనా నన్ను అడిగితే అతని నిద్రకర్మ పూర్తయింది కనుక అతను నిద్రలేచాడని చెప్తాను. అతనిని లేపింది అతని కర్మయే.

## నీ చేతుల్లో ఎంతవరకు ఉంది?

నీవు, నిజమైన నీవు ఎన్నడూ తినలేదు. భోజనం చేసేది చందూలాల్. నీవెన్నడూ ఏమీ తినకపోయినప్పటికీ, ఎవరైతే తింటున్నారో అది నువ్వే అని నమ్ముతున్నావు. తినేది చందూలాల్, టాయిలెట్‌కి వెళ్లేది కూడ చందూలాల్. నిష్కారణంగా నీవు యిందులో యిరుక్కొంటున్నావు. ఇది నీకు అర్థమైందా?

ప్రశ్నకర్త : దయచేసి వివరించండి.

దాదాశ్రీ : విసర్జనక్రియకి కూడ స్వతంత్రశక్తిగల మనిషి ఇంత వరకు జన్మించలేదు. అతని ప్రేగులపైనే అతనికి స్వతంత్ర శక్తి లేనపుడు ఇంకా వేరే ఏ శక్తి అతనికి ఉంటుంది? మలబద్ధకం ఏర్పడినపుడు ఈ విషయం అతను గుర్తిస్తాడు. ఏవో కొన్ని విషయాలు అతని ప్లాన్ ప్రకారం జరగగానే అతనే వాటిని చేసినట్లు తలుస్తాడు.

నేను బరోడాలో ఫిజిషియన్స్ బృందంతో ఒక సత్సంగం జరిపాను. అపుడు వారితో నేను "టాయ్‌లెట్‌కి వెళ్లటానికి కూడ మీకు స్వతంత్రశక్తిలేదు'' అన్నాను. వారు దానిని అంగీకరించలేదు. మళ్లీనేను "మలబద్ధకం ఏర్పడినపుడు ఆ విషయాన్ని మీరు గుర్తిస్తారు. అపుడు ఇంకొకరి సహాయంకోరవలసి వస్తుంది'' అన్నాను. ఆశక్తి మీకు ఎన్నడూ లేదు కనుకనే సహాయంకోరవలసి వస్తుంది. అంటే విసర్జన క్రియ మీ కంట్రోల్‌లో లేదు. మీ రాంగ్ బిలీఫ్ వల్ల ప్రకృతి శక్తిని మీ శక్తిగా తలుస్తున్నారు. ఇంకొకరి శక్తిని మీ శక్తిగా పేర్కొనటం భ్రమ, అదే రాంగ్ బిలీఫ్. నేను ఏమి చెప్పదల్చుకొన్నానో నీవు అర్థం చేసికొన్నావా? ఇప్పుడు విస్పష్టమయ్యిందా?

ప్రశ్నకర్త : అవును, అర్ధమయింది.

దాదాశ్రీ : ఇంతమాత్రం నువ్వు అర్ధం చేసికొన్నట్లయితే చిక్కుప్రశ్నని పరిష్కరించటానికి దగ్గరలో ఉన్నట్లే. ప్రజలంతా తపస్సు, జపము, ధ్యానము, ఉపవాసము చేయాలని చెప్తారు. ఇదంతా ఒక భ్రమ. ఇదంతా ఒక మాయ, భ్రమ. ఈ ప్రపంచం ఎప్పటికీ ఇలాగే కొనసాగుతుంది. అహంకారం లేకుండా ఎప్పటికీ ఉండదు. అది దాని స్వభావం.

## అదే జరుగుతుంది....

దాదాశ్రీ : ఏదైనా మన నియంత్రణ వల్లనే జరుగుతుందా? లేక దానికదే జరుగుతుందా?

ప్రశ్నకర్త : వాటంతట అవే జరుగుతాయి.

దాదాశ్రీ : అవును అన్నీ అవే జరుగుతాయి. ఉదయం నీవునిద్ర లేవటంకూడ అదే జరుగుతుంది. నీవు టీ తాగ్రటం కూడ అదే విధంగా జరుగుతుంది. నీవు టాయిలెట్ చేయటం, నిద్రించటం కూడ వాటంతట అవే జరుగుతాయి. అవి జరిగేటట్లు నీవు చేస్తున్నావా లేక అవే జరుగుతున్నాయా?

ప్రశ్నకర్త : అదే జరుగుతుంది.

దాదాశ్రీ : అవును. కాబట్టి ఈ ప్రపంచంలో అంతా దానికదే జరుగుతుంది. ఇదే ప్రపంచాన్ని గురించిన యదార్ధము. పనులు అవే జరుగుతుంటాయి. కానీ మనుష్యులు 'నేను దీనిని చేస్తున్నాను', 'నేను టాయిలెట్ కెళ్లాను', 'దీనిని నేను చేస్తాను', 'ఈ డబ్బు నేను సంపాదించాను' ఇలా చెప్తుంటారు. ఏదైనా ఒక విషయం దానంతట అదే జరుగుచుండగా మనం 'నేను చేస్తున్నాను' అని చెప్తాము. ఈ విధంగా మనం కొత్త కర్మను సృష్టించుకొంటున్నాము (కొత్త కర్మకు బీజాలు నాటుతున్నాము). కొత్తగా కర్మను సృష్టించుకొనడం (ఛార్జింగ్) నీవు ఆపినట్లయితే స్వేచ్ఛను పొందుతావు. జ్ఞానప్రాప్తి లేకుండా కొత్త కర్మల సృష్టిని ఎవరూ ఆపలేరు.

## కర్తృత్వబుద్ధి=ప్రకృతి : అకర్తాభావం=ఆత్మ

ప్రపంచంలోని మనుష్యులందరూ బొంగరాలు. బొంగరం అంటే ఏమిటి? అది ఒక ఆటవస్తువు. ఒక త్రాడును దానికి చుట్లుగా చుట్టి త్రాడుని వెనక్కి లాగినప్పుడు దానిముల్లుమొన మీద తిరిగే ఆటవస్తువే బొంగరము. దానిశక్తి పూర్తిగా వ్యయము అయ్యేవరకు గిరగిరా తిరుగుతుంది. ఈ ఉదాహరణలో త్రాడును చుట్టటం భావపురుషార్థం (కర్మ) గాను మరియు బొంగరం తిరగటం ప్రారబ్దం (కర్మఫలం) గాను పోల్చవచ్చు. ఒక వ్యక్తి చేత పనులను చేయించేది అతని ప్రకృతి (స్వాభావిక గుణములు), కాని అతను "నేను చేస్తున్నాను" అని చెప్తాడు. వాస్తవానికి అతను కీయిస్తే నడిచే కీలుబొమ్మ. ప్రకృతి అతని చేత తపము, మంత్రజపము, ధ్యానము వంటి వాటిని చేయిస్తే వాటిని చేస్తున్నది తానే అని నమ్ముతాడు.

ప్రశ్నకర్త : దాదాజీ! మాకు ప్రకృతి గురించి చెప్పండి.

దాదాశ్రీ : నిన్ను నీవు 'కర్త' అని భావించిన క్షణంలోనే ప్రకృతి ప్రవేశిస్తుంది. ఆత్మవైన నీవు అకర్తవు. 'నేను చందూలాల్' అని మరియు 'నేను కర్తను' అని నీకు రాంగ్ బిలీఫ్ వుంది. దీనిని భావించిన క్షణంలోనే నీవు బంధింపబడుతున్నావు. ఈ రాంగ్ బిలీఫ్ కారణంగానే ప్రకృతి జీవించివుంటుంది. నిజమైన 'నేను' గురించిన అజ్ఞానం ఉన్నంతవరకు వ్యక్తి తననుతాను కర్తగా భావించటం, తన ప్రకృతిచే తాను బంధింపబడటం జరుగుతుంది. 'నేను కర్తను కాదు' అనే ఎరుకను పొందినపుడు కర్తృత్వ భావనపోతుంది. ఇక ప్రకృతి యొక్క ఉనికికి అవకాశమేలేదు. ఆక్షణం నుంచి అతను కొత్త కర్మలవలన బంధింపబడడు. గత కర్మలు మాత్రం మిగిలి ఉంటాయి. అవి అనుభవించటం ద్వారా తొలగిపోతాయి.

## కర్త (కర్తృత్వం) మరియు నైమిత్తిక (సాధనం రూపంలో) కర్త

ప్రశ్నకర్త : ఒకరు వాస్తవంలో స్వయంగా కర్త కానట్లయితే మరికర్త ఎవరు? కర్తయొక్క స్వభావం ఏమిటి?

దాదాశ్రీ : ఒకరి కర్తృత్వం కేవలం నైమిత్తికం (పరికరంమాత్రమే). దేనికీ ఏ విషయంలోనూ ఎవరూ స్వతంత్రకర్తకాదు.

ఈ నైమిత్తిక కర్తృత్వాన్ని పార్లమెంటరీ పద్ధతిలో ఇలా నిర్వచించవచ్చు. పార్లమెంటులో ఏదైన ఒక విషయంలో అంతిమ నిర్ణయం సామూహిక ఓట్లబలంపై ఆధారపడి వుంటుంది. ప్రతి ఒక్కరికీ ఒక్క ఓటు మాత్రమే ఉంటుంది. అనేక మంది ఓట్లలో నీదికూడ ఒక్క ఓటు మాత్రమే. కానీ నువ్వు “నేను చేస్తున్నాను” అని నమ్ముతావు కనుక నువ్వు ‘కర్త’ అవుతున్నావు.

ఈవిధమైన భావపురుషార్థం ద్వారా నీకు నీవే ప్లాన్ వేసుకొని కర్తృత్వబుద్ధి ద్వారా ప్లానింగ్ కి ఆమోదముద్రవేస్తున్నావు. కర్తృత్వభావం ద్వారా కొత్త కర్మలను సృష్టించుకొంటున్నట్లు (భవిష్యత్‌కి ప్లాన్ వేసుకొంటున్నట్లు) ప్రపంచంలో ఎవరికీ తెలియదు. ‘కర్త’ అయినవారు ‘భోక్త’ కూడ కావలసే వుంటుంది. ఇంకోమాటలో చెప్పాలంటే ఈ జన్మలో మనకు అనుభవమయ్యేదంతా పూర్వజన్మలోని మన భావరూపప్లానింగ్‌కి ఫలము. ‘కర్తృత్వం’ అనేది భావరూపంలోనే వుంటుంది.

చందూలాల్ అంతరంగం అనే చిన్న కంప్యూటర్ యొక్క ఔట్‌పుట్ సైంటిఫిక్ సర్కమ్‌స్టెన్షియల్ ఎవిడెన్స్ అనే పెద్దకంప్యూటర్‌కి ఇన్‌పుట్ గా మారుతుంది. ఈ విధంగా ప్లానింగ్ (భావపురుషార్థం) పెద్ద కంప్యూటర్‌లోకి ఫీడ్ అవుతుంది. అపుడు పెద్దకంప్యూటర్ ఈ ప్లానింగ్‌కి ఫలితాలను యిస్తుంది. ఒకరి జీవితంలోని సంఘటనలు అన్నీ ఫలరూపమే. గత జన్మలో మనం సృష్టించుకొన్న కారణాలకి (కర్మలకి) ఫలమే ప్రస్తుత జన్మలోని డిశ్చార్జిరూప ఘటనలు. ఈ జన్మకి సంబంధించిన వేటినీ తాను కంట్రోల్ చేయటానికి వీలులేదు. అది ఇంకొకరి అధీనంలో ఉంటుంది. ఒకసారి ప్లానింగ్ జరిగాక అది ప్లాన్ చేసిన వారి చేయిదాటి ఇంకొకరి అధీనంలోకి, ఇంకొకరి చేతుల్లోకి వెళ్లిపోతుంది. ఆ ఇంకొకరు సైంటిఫిక్ సర్కమ్ స్టెన్షియల్ ఎవిడెన్స్ (వ్యవస్థిత్ శక్తి). ఆప్లాన్ క్రియారూపందాల్చి ఫలితాలను ఇవ్వటం కోసం ప్రాసెసింగ్ జరుగుతుంటుంది. ఫలితాలు ఊహించినదానికంటె భిన్నంగా ఉండవచ్చు. డిశ్చార్జి కర్మ యొక్క ఫలితాలు పూర్తిగా పరాధీనం. ఇది చాలా సూక్ష్మవిషయం. ఇది నీకు అర్థమయిందా?

ప్రశ్నకర్త : అర్థమయింది దాదా!

# కర్తృత్వం కర్మ బంధమౌతుంది

ఏవైనా ప్రశ్నలు అడగ దల్చుకొంటే నిస్సంకోచంగా అడుగు. నీవు తెలుసుకొనదల్చినది ఏదైనా సరే అడుగు. ఈ విజ్ఞానం చాలా విలువైనది.

ప్రశ్నకర్త : కర్మ బంధం నుండి ఎలా ముక్తిపొందగలం?

దాదాశ్రీ : 'కర్తను' అనే బిలీఫ్ కారణంగానే కర్మలకు ఉనికి ఉంటుంది. కర్మల యొక్క ఉనికి కర్తృత్వం పైనే ఆధారపడివుంది. కర్తృత్వం లేకుంటే కర్మలేదు. నీమూలస్వభావంలో (ఆత్మస్థానంలో) నీవు ఉన్నట్లయితే కర్తృత్వంలేదు, అందువల్ల కర్మ కూడలేదు. కర్తృత్వం ఉన్నపుడే కర్మ సృష్టింపబడుతుంది. నీవు చందూలాల్‌గా 'నేను ఇది చేసాను', 'నేను అది చేసాను' అని నమ్మటంవల్ల, చెప్పటంవల్ల, 'కర్త' వి అవుతున్నావు. ఇదే కర్మకి ఆధారమవుతుంది. నీవు 'కర్త' కాకుండావుంటే కర్మకి ఆధారం వుండదు. ఆధారంలేని కారణంగా అవి పడిపోతాయి. కర్తృత్వం ఉన్నంతవరకే కర్మ ఉంటుంది.

## ఆత్మ మరియు అనాత్మ అజ్ఞానం వల్ల ఒకటయ్యాయి.

ఆత్మ మరియు అనాత్మ రెండు వేర్వేరు వస్తువులు. అవి రెండూ ఒకటి కాలేదు కానీ ఒక దానినొకటి అతుక్కొని వున్నాయి. ఎలా ? కర్తృత్వ భ్రాంతి అనే భ్రాంతిరసం వల్ల అవి రెండూ అతుక్కొని పోయాయి.

ఈ భ్రాంతిరసం ఎక్కడినుంచి వస్తుంది? ఒకరు "నేను దీనిని చేసాను" అని చెప్పిన క్షణంలోనే ఆత్మయొక్క మరియు అనాత్మయొక్క రసం (జిగురు పదార్థం) ఏర్పడుతుంది. ఈ రసం ఎంత జిగటతత్త్వం కల్గిఉంటుందంటే కొన్ని సంవత్సరాల తర్వాత కూడా అది విడకుండా ఉంటుంది. ఇంక ప్రతిరోజు ఉత్పన్నమయి దానికి చేర్చబడే కొత్త జిగురురసం గురించి ఏమి చెప్పగలం?

ఒక జ్ఞాని ఈ భ్రాంతి రసాన్ని అంతటినీ తొలగించి ఆత్మని, మరియు అనాత్మని వేరు చేయగలడు. అపుడు ఆత్మ దాని సహజ స్థితిలో ఉంటుంది; మరియు అనాత్మకూడా దాని సహజస్థితిలో ఉంటుంది. ఎంతవరకు అహంకారం ఉంటుందో

అంతవరకు, మాయావరణ వల్ల, ఒక వ్యక్తి ఎప్పటికీ "నేను కర్తను మరియు నేను జ్ఞాతను'' అని చెప్తాడు, నేను 'కర్తను' మరియు నేను 'జ్ఞాతను' అనే రెండు అభిప్రాయాలు కలిసి ఉన్నపుడు అదే భ్రాంతి (మాయ) అని, జ్ఞేయము అని చెప్పబడ్తుంది. ఎప్పుడు 'నేను జ్ఞాతను మరియు ద్రష్టను' అనే మనోభావము 'నేను కర్తను' అనే భావంతో కలవకుండా ఉంటుందో అది జ్ఞాతగా పిలవబడుతుంది.

ఇపుడు నువ్వు 'నేను చందూలాల్' అని నమ్ముతున్నావు. ('నేను' మరియు 'నాది' ఒకటిగా తలుస్తున్నావు). ఆ కారణంగానే ఆత్మ మరియు అనాత్మ ఒకటిగా అయ్యాయి. నిజానికి ఇవి వేర్వేరు వస్తువులు. నువ్వు వేరు మరియు చందూలాల్ వేరు. ఈ భేదాన్ని నీవు గ్రహించనంతవరకు నీవేమి చేయగలవు? ఒక జ్ఞానిపురుషుడు భేదజ్ఞానంద్వారా నీ కోసం వీటిని వేరు చేయగలడు.

ఆ తర్వాత నిజమైన 'నేను' (నువ్వు) ఏమీ చేయవు. అన్ని పనులూ చందూలాల్ కొనసాగిస్తాడు.

## (6) ఈ వైజ్ఞానిక విభజన ఎవరు చేస్తారు? ఆత్మ - అనాత్మల విజ్ఞాన పూర్వక విభజన.

ఆత్మజ్ఞానం అంటే ఏమిటి ? ఆత్మ (పురుషుడు, స్వస్వరూపము) యొక్క మరియు అనాత్మ (ప్రకృతి ) యొక్క స్వాభావిక గుణములను గురించి తెలిపే జ్ఞానమే ఆత్మ జ్ఞానం. ఎవరైతే ఆత్మ మరియు అనాత్మల యొక్క సహజగుణములను తెలిసికొని ఉంటారో, మరియు ఈ వైజ్ఞానిక విభజన విధానం (జ్ఞానవిధి) ద్వారా స్వస్వరూపానుభూతిని పొంది ఉంటారో వారిని ఆత్మజ్ఞానం పొందినవారు అనిచెప్పవచ్చు. ఆత్మజ్ఞానం పొందినందువల్ల వారికి ఆత్మ అనాత్మల స్వాభావిక గుణభేదముల ఎరుక ఉంటుంది.

నీ అంతట నీవు (స్వప్రయత్నంతో) ఆత్మజ్ఞానమును పొందుట సాధ్యం కాదు. ఎందువల్లనంటే ఇప్పుడు నీవు జీవిస్తునదీ, ప్రవర్తిస్తున్నదీ కూడ ప్రకృతి విభాగంలోనే. ప్రకృతిలో వుంటూ ప్రకృతిని నాశనంచేయ ప్రయత్నిస్తున్నావు. ఇది ఎలా సాధ్యపడుతుంది? నీవు దాని ఉపరితలాన్ని మాత్రమే గీక గలవు గాని ప్రకృతిని సమూలంగా నాశనం చేయలేవు. ఉదాహరణకి, ఈ వస్త్రం మురికి అయితే దానిని

తొలగించటానికి నీకు సబ్బుకావాలి. ఈ మలినాన్ని తొలగించే ప్రక్రియలో సబ్బుయొక్క అవశేషాలు వస్త్రంపై మిగిలిపోతాయి. ఒక అవశేషాన్ని తొలగిస్తే ఇంకో అవశేషం వస్త్రంపై చోటు చేసుకొంటుంది. అపుడు సబ్బు యొక్క అవశేషాన్ని తొలగించటం కోసం టినోపాల్ ఉపయోగించాలి. అపుడు టినోపాల్ తన అవశేషాలను వస్త్రంపై మిగిల్చిపోతుంది. ఒకరు స్వప్రయత్నంతో ఆత్మజ్ఞానాన్ని పొందటం సాధ్యంకాదని వివరించటంకోసం ఈ సాదృశ్యము చెప్తున్నాను. ఆత్మజ్ఞానాన్ని పొందకుండా ప్రకృతిని బలహీన పర్చగలమేగాని, ప్రకృతిని నాశనం చేయటం సాధ్యంకాదు. మీరొకసారి ఆత్మఅనాత్మల సహజగుణవిశేషణములను గుర్తించటం జరిగితే మీకు పరిష్కారం లభిస్తుంది. ఈ గుణవిశేషణములను తెలుసుకొనుటలో మీకు జ్ఞానిపురుషుడు సహాయపడగలడు. జ్ఞానిపురుషుడు మాత్రమే మీ ఆత్మ అనాత్మలను వేరుపర్చగలడు.

ఉదాహరణకి ఈ బంగారు ఉంగరంలో బంగారం మరియు రాగి మిశ్రమంగా ఉన్నాయి. ఈ బంగారాన్ని రాగినుంచి ఎవరు వేరు చేయగలరని నీవు తలుస్తున్నావు?

ప్రశ్నకర్త : కంసాలి మాత్రమే ఆ పని చేయగలడు.

దాదాశ్రీ : అవును, ఒక్క కంసాలి మాత్రమే బంగారాన్ని, రాగిని వేరు చేయగలడు, ఎందువల్లనంటే ఆ రెండు మూలకముల యొక్క సహజ గుణములు అతనికి తెలుసు కనుక. అదే విధంగా జ్ఞాని పురుషునికి ఆత్మ అనాత్మల సహజగుణములు తెలిసినందున అతడు ఆరెంటినీ వేరుచేయగలడు.

ఈ ఉంగరంలో బంగారం, రాగి కాంపౌండు రూపంలో కాక మిశ్రమ రూపంలో ఉన్నాయి. అందువల్లనే కంసాలి తేలికగా మిశ్రమాన్ని వేరుచేయగలడు. అదే విధంగా, ఆత్మఅనాత్మలు కాంపౌండు రూపంలో కాక మిశ్రమ రూపంలో ఉన్నందున ఒక మూలకాన్ని రెండో మూలకం నుంచి వేరు చేయటం సాధ్యం అవుతున్నది. అవి కాంపౌండు రూపంలో ఉన్నట్లయితే వాటిని రెండుగా విభజించటం సాధ్యం కాదు. మిశ్రమ రూపంలో ఉన్నందువల్లనే జ్ఞానిపురుషుడు ఆత్మఅనాత్మలను వేరు చేయగలగటం, ఆ వ్యక్తి ఆత్మానుభూతిని పొందటం సాధ్యమవుతున్నది.

# జ్ఞాన విధి అంటే ఏమిటి ?
# జ్ఞానిచే నిర్వహించబడే ఆత్మ అనాత్మల ప్రత్యేక విభజన ప్రక్రియయే జ్ఞానవిధి

ప్రశ్నకర్త : జ్ఞానవిధి అనగానేమి ?

దాదాశ్రీ : జ్ఞానవిధి అనగా ఆత్మను అనాత్మ (దేహం) నుంచి వేరుచేసే ప్రక్రియ. ఇది జడ తత్త్వంనుంచి చేతనతత్త్వాన్ని వేరు చేయటం.

ప్రశ్నకర్త : ఈ సిద్ధాంతము సరియైనదే, కాని వేరుచేసే పద్ధతి ఏమిటి ?

దాదాశ్రీ : ఈ పద్ధతిలో యిచ్చుట, పుచ్చుకొనుట వంటిదేమీ జరగదు. కేవలం కూర్చుని నేను చెప్పినది చెప్పినట్లుగా తిరిగి చెప్పాలి. ("నేను ఎవరిని?" అనే జ్ఞానం ఒక్క రెండు గంటల ప్రక్రియలో లభిస్తుంది. ఇందులో 48 నిమిషాలు ఆత్మ అనాత్మలను వేరు పరచే భేదజ్ఞాన వాక్యాలను (విభజనవిజ్ఞానం) పలుకవలసివుంటుంది. ఆ తర్వాత ఒక గంట సమయం ఐదు ఆజ్ఞలను మీకు సోదాహరణముగా వివరించటం జరుగుతుంది. తద్వారా మీరు నిత్యజీవితంలో ఎలా ప్రవర్తిస్తే కొత్త కర్మలు ఛార్జికాకుండా ఉంటాయో, గతకర్మలను ఏవిధమైన ఉద్వేగానికిలోను కాకుండా సమతతో ఎలా పూర్తిచేసికోగలరో మీకు తెలుపబడుతుంది. మీరు శుద్ధాత్మ అనే ఎరుక మీకు స్థిరంగా నిల్చి ఉంటుంది.)

## గురువు అవసరమా లేక జ్ఞాని అవసరమా ?

ప్రశ్నకర్త : ఒక వ్యక్తి దాదాజీని కలవకముందే ఒకరిని గురువుగా స్వీకరించినట్లయితే అతడు ఏమి చేయాలి?

దాదాశ్రీ : ఇప్పటికీ మీరు ఆ గురువు వద్దకు వెళ్లాలనుకుంటే వెళ్లవచ్చు. లేకుంటే లేదు. నిర్బంధం ఏమీ లేదు. మీరు అతనిని గౌరవించితీరాలి. కొంతమంది నా వల్ల జ్ఞానం పొందిన తర్వాత, తమయొక్క పూర్వపు గురువును వదలివేయాలా అని నన్నడుగుతుంటారు. నేను వారితో "అలా వదలిపెట్టకూడదు. ఆ గురువుయొక్క అనుగ్రహంతోనే మీరు యిక్కడకు రాగలిగారు" అని చెప్తాను. వారు

మర్యాదపూర్వకమైన జీవితాన్ని జీవించటానికి సాయపడింది ఆ గురువే. గురువు లేనిచో జీవితంలో పవిత్రత అనేదేవుండదు. మీరు ఒక జ్ఞాని పురుషుని కల్సుకోబోతున్న విషయాన్ని మీ గురువుకి కూడా చెప్పవచ్చు. కొంతమంది తమ గురువును కూడా నా వద్దకు తీసుకొని వస్తుంటారు. ఆ గురువు కూడా మోక్షాన్ని కోరతాడు. గురువు లేకుండా లౌకిక జ్ఞానమూ, పారలౌకిక జ్ఞానమూ కూడా లభించదు. లౌకిక జీవనానికి గురువుయొక్క ఆవశ్యకత, మోక్షార్థం జ్ఞాని పురుషుని ఆవశ్యకత ఉంది.

## (7) మోక్షం (సంపూర్ణ స్వేచ్ఛ) యొక్క స్వరూపం ఏమిటి? ఏకైక లక్ష్యం కల్గి వుండాలి.

ప్రశ్నకర్త : మనిషికి ఉండదగిన లక్ష్యం ఏమిటి ?

దాదాశ్రీ : మోక్షమే ఏకైక లక్ష్యం అయి వుండాలి. నీవు ముక్తిని కోరటం లేదా? ఎంతకాలం లక్ష్యరహితంగా సంచరించాలనుకొంటున్నావు ? అనంత జన్మలుగా నీవు చేసినది ఇదే. ఇంకా సంచరించవలసిన స్థానం ఏదీ నువ్వు మిగల్చలేదు. జంతుగతి, మనుష్యగతి మరియు దేవగతి (స్వర్గ సంబంధమైనది) - వివిధ గతులలో నీవు లక్ష్య రహితంగా సంచరించావు.

అంతం లేని ఈ పరిభ్రమణ వేదన నీవు ఎందుకు పొందినట్లు? నీ నిజమైన గుర్తింపు నీకు తెలియక పోవటమే దీనికి కారణం, "నే నెవరిని" అనే ప్రశ్నకి నీకు సమాధానం తెలియదు. నీ నిజ స్వరూపాన్ని నువ్వు తెలుసుకోవద్దా ? అసంఖ్యాకమైన జన్మల పరిభ్రమణం తర్వాతనైన నిజానికి నీవెవరివో కూడ నీకు తెలియదు. ధనార్జనమే జీవితంలో నీకు ఏకైక లక్ష్యమా? నీమోక్షం నిమిత్తం నీవు కొంచెమైనా ప్రయత్నింప వలదా?

ప్రశ్నకర్త : అవును. ప్రయత్నించవలసి ఉన్నది.

దాదాశ్రీ : స్వాతంత్ర్యమును పొందవలసిన అవసరం లేదా ? ఎంతకాలం ఇలా బద్ధుడవై వుండగలవు?

ప్రశ్నకర్త : స్వేచ్ఛను పొందవలసిన అవసరం లేదు కానీ స్వేచ్ఛను పొందవలసిన ఆవశ్యకతను గురించి తెలుసుకోవలసి ఉన్నదని నా అభిప్రాయం.

దాదాశ్రీ : అవును. దానిని అర్థం చేసుకోవటం అవసరమే. ఒకే ఒక్కసారి దీనిని గ్రహిస్తే చాలు. నీవు స్వతంత్రుడవు కాలేకపోయినప్పటికీ, కనీసం దాని గురించి తెలుసుకోవాల్సిన అవసరం ఉంది, అవునా ? స్వాతంత్ర్యము తర్వాత వస్తుంది కానీ ప్రస్తుతం దాని గురించి తెలుసుకుంటే చాలు.

## స్వస్వరూపానుభూతికి ఏ ప్రయత్నమూ అవసరం లేదు.

మోక్షం అంటే నీ నిజ స్వరూపానికి రావటమే. సంసారం అంటే నీ నిజ స్వరూపం నుంచి దూరంగా పోవటము. ఈ రెండింటిలో ఏది తేలిక? నీ నిజ స్వరూపానికి రావటం కష్టం కాదు కానీ నీ నిజ స్వభావానికి నిన్ను దూరం చేసే ప్రాపంచిక జీవనమే సదా కఠినమైనది. కిచిడీ తయారు చేయటం కంటే మోక్షం చాలా తేలిక. కిచిడీ తయారు చేయడానికి వివిధ పదార్థములు కావాలి : బియ్యం, పప్పు. సుగంధ ద్రవ్యాలు, కూరగాయలు, నీళ్లు, వంటపాత్ర, ఇంధనం, స్టౌ మొదలైనవి. అపుడు మాత్రమే నీవు కిచిడీ తయారు చేయగలవు. కానీ మోక్షమో కిచిడీ కంటే తేలిక. అయితే మోక్షప్రదాత అయిన జ్ఞాని పురుషుడు లభించాలి. లేకుంటే మోక్షం ఎప్పటికీ లభించదు. నీవు అనేక జన్మలు ఎత్తలేదా?

## అప్రయత్నంగా లభించేదే మోక్షం

నా వద్దకు వచ్చి మోక్షాన్ని పొందవలసినదిగా నేను మీకు చెప్తున్నాను. కాని ప్రజలు "మా ప్రయత్నం ఏమీ లేకుండా ఎవరైనా మాకు మోక్షాన్ని ఎలా యివ్వగలరు?'' అని సంశయాత్మకులై అడుగుతున్నారు. అయితే మంచిదే, స్వప్రయత్నం ద్వారానే మీరు దాన్ని పొందండి. ప్రయత్నంతో, పనికిరానివిషయాలను మాత్రమే నీవు పొందుతావు. ప్రయాసపడి మోక్షమును ఇంతవరకు ఎవరూ పొందలేదు.

ప్రశ్నకర్త : మోక్షాన్ని ఇవ్వటం లేక పుచ్చుకోవటం సాధ్యమా?

దాదాశ్రీ : మోక్షం అంటే ఒకరు ఇచ్చేది ఇంకొకరు పుచ్చుకొనేది అయిన వస్తువు కాదు. కానీ నీకు ఒక నిమిత్తుడు అవసరం. (జ్ఞాని నీకు నిమిత్తుడు. నీవు మోక్షాన్ని

పొందే మార్గంలో ఆయన ఒక సాధనం లేదా కారణభూతుడు అవుతాడు.) మోక్షం నైమిత్తికమైనది (ఒక సాధనం ద్వారా పొందవలసినది). నీవు నన్ను కలుసుకోవటం కూడ ఒక నైమిత్తిక క్రమమే. వాస్తవంలో మోక్షాన్ని ఇచ్చేవారు గానీ పుచ్చుకునేవారు గాని ఎవరూ లేరు. నీకు చెందిన ఏదైనా వస్తువును నీవు యిచ్చినట్లయితే అపుడు నీవు దాతవు అవుతావు. ఏదైనా వస్తువును నీవు యింకొకరికి యిచ్చినపుడు నీవు దానిపై నీకు గల అధికారాన్ని కోల్పోతావు. కానీ మోక్షం నీ జన్మహక్కు. జ్ఞానం ద్వారా నీ నిజస్వరూపాన్ని నీకు ఎరుకపర్చటంలో నేను నిమిత్త మాత్రుడిని మాత్రమే. నేను కేవలం సాధనాన్ని. ఇప్పటికే నీది అయిన దానిని నేను నీకు యివ్వలేను. నేను యిచ్చేవాడినీ కాదు, నువ్వు పుచ్చుకొనే వాడివీ కాదు.

## మోక్షం అనగా సనాతన సుఖము లేక శాశ్వతానందము.

ప్రశ్నకర్త : మోక్షాన్ని పొందటం వల్ల కలిగే ప్రయోజనం ఏమిటి?

దాదాశ్రీ : కొంతమంది ప్రజలు నాతో తమకు మోక్షకాంక్ష లేదని చెప్తారు. అపుడు నేను వారిని "మోక్షం యొక్క అవసరం మీకు లేక పోవచ్చు కానీ మీరు సంతోషాన్ని కోరుకోవటం లేదా? దు:ఖమే మీకు యిష్టమా?" అని అడుగుతాను. తాము సంతోషాన్ని కోరుకుంటున్నామని వారు చెప్తారు.

నిజంగా మోక్షం అంటే ఏమిటో ప్రజలకు తెలియదు. కానీ వారు మోక్షం అనే పదాన్ని ఉపయోగిస్తుంటారు. మోక్షం ఏదో ఒక ప్రత్యేక స్థలంలో ఉందని, అక్కడకు చేరటం వలన దానిని అనుభవించవచ్చునని అభిప్రాయపడుతుంటారు. కాని అది యదార్థం కాదు.

## మోక్షం యొక్క రెండు దశలు.

ప్రశ్నకర్త : సాధారణంగా, జనన మరణ చక్రం నుంచి విడుదల కావటం లేదా స్వేచ్ఛను పొందటమే మోక్షం అని మేము తలుస్తాము.

దాదాశ్రీ : అవును అది నిజమే, కానీ అది మోక్షం యొక్క చివరి దశ. అదే రెండవ దశ. సంసార సమస్యలు, దు:ఖాలలో చలించని తటస్థస్థితి మోక్షం యొక్క మొదటి దశ. జీవితంలోని సుఖదు:ఖాలు రెండూ అతనిని స్పృశించలేవు (కలతపెట్ట జాలవు).

జీవించి ఉండగానే సమాధి సుఖాన్ని పొందటం మోక్షం యొక్క మొదటి దశ. దు:ఖం యొక్క ఆత్యంతిక నివృత్తి, నీదైన ఆనందాను భూతిని పొందటం సమాధి. ఇది మొదటి దశ. దేహ త్యాగానంతరం పొందేది మోక్షం యొక్క రెండో దశ. కానీ మోక్షం యొక్క మొదటి దశను జీవితకాలంలో ఇప్పుడే పొందాలి. మోక్షం యొక్క ఈ మొదటి దశను నేను సదా అనుభవిస్తున్నాను. ప్రపంచ వ్యవహారాలలో జీవిస్తూ కూడ వాటి వల్ల ప్రభావితం కాని సుఖమే మోక్షం. సంసారంలో ఉంటూ కూడ అది నిన్ను స్పృశింపక పోవటమే మోక్షము. ఏ రకమైన నిర్బంధాలు లేని అటువంటి మోక్షం కోసమే ఎవరైనా తపించవలసి ఉన్నది. అటువంటి మోక్షదశ అక్రమ విజ్ఞానం ద్వారానే సాధ్యం.

## దైనందిన జీవితంలో మోక్షానుభూతి.

ప్రశ్నకర్త : అటువంటి స్వేచ్ఛ లేక మోక్షాన్ని (జీవన్ముక్తి) జీవితకాలంలో ఎవరైనా అనుభవించారా? లేక అది మరణం తర్వాత లభించే మోక్షమా?

దాదాశ్రీ : మీరు చనిపోయిన తర్వాత లభించే స్వేచ్ఛవల్ల ప్రయోజనం ఏమిటి? మరణించిన తర్వాత మోక్షం వస్తుందని చెప్పేవారి వాగ్దానాలు నమ్మి ప్రజలు ఇలాగే మోసపోతున్నారు. జీవితకాలంలో అనుభవానికి రాని మోక్షం వల్ల ప్రయోజనం ఏమిటి?

మోక్షం యొక్క రుచి ఏమిటో ఇప్పుడే ఇక్కడే నువ్వు అనుభవించి తెలుసుకోవాలి. లేకుంటే మోక్షం అనేది ఒకటి ఉన్నదని ఎలా నమ్మకం కుదురుతుంది? మరణం తర్వాత మోక్షం అరువు తెచ్చుకొన్న మోక్షం వంటిది. అలా అరువు తెచ్చుకొన్న వాటిపై ఆధారపడకూడదు. రెడీ క్యాష్ వలె మోక్షం నీ చేతుల్లో ఉండాలి. అటువంటి మోక్షాన్ని జీవించి ఉండగా నీవు అనుభవించగలవు. జనకమహారాజు తన జీవితకాలంలోనే మోక్షాన్ని అనుభవించాడు. దీని గురించి నువ్వు విన్నావా?

ప్రశ్నకర్త : విన్నాను.

## మోక్షాన్ని సాధించేది ఎవరు?

ప్రశ్నకర్త : వాస్తవంలో, మోక్షాన్ని పొందేది ఎవరు?

దాదాశ్రీ : మోక్షం ద్వారా విడుదలయ్యేది అహంకారం మాత్రమే. బంధింపబడినవారే

మోక్షాన్ని పొందుతారు. ఎవరు బాధపడుతున్నారో వారే ముక్తి పొందుతారు. ఆత్మసదా ముక్తమే. మోక్షమే ఆత్మ యొక్క దశ.

ఎవరు బంధింపబడ్డారో, బంధనాలవల్ల ఎవరు బాధపడతారో వారే స్వతంత్రం కోసం వెదుకుతారు. శృంఖలాల బాధను అనుభవించేది అహంకారమే. అందువల్ల ఆ అహంకారమే ముక్తి పొందవలసి ఉన్నది. అజ్ఞానం తొలగనంత వరకు అహంకారానికి ముక్తి లేదు. ఎపుడైతే నీవు జ్ఞాని పురుషుని నుంచి జ్ఞానాన్ని పొందుతావో అపుడు అజ్ఞానం తొలగి అహంకారం ముక్తిని పొందుతుంది.

## జ్ఞానం మాత్రమే అన్ని దు:ఖాలను అంతం చేయగలదు.

ఈ ప్రపంచం దు:ఖాల ఊబిలో కూరుకుని పోయింది. దు:ఖానికి కారణం ఏమిటి? ఆత్మను గురించిన అజ్ఞానం నుంచి ఈదు:ఖం శాఖోపశాఖలుగా విస్తరించింది. ప్రపంచంలోని దు:ఖాని కంతటికీ మూలం అజ్ఞానమే. ఈ అజ్ఞానమే రాగ ద్వేషాలకు దారితీసి దు:ఖానుభూతిగా పరిణమిస్తుంది. జ్ఞానం మాత్రమే ఈదు:ఖాన్ని మాన్పగలదు. దీనికి వేరే మార్గం లేదు. దు:ఖం మిమ్మలను స్పృశించకుండా జ్ఞానం రక్షణనిస్తుంది.

## (8) అక్రమ మార్గం అంటే ఏమిటి?

## అక్రమ జ్ఞానం యొక్క అత్యధిక శక్తులు.

ప్రశ్నకర్త : వివాహితుడైన సంసారికి కూడ తేలికగా ఆత్మజ్ఞానం పొందటం సాధ్యమా ?

దాదాశ్రీ : అవును. అటువంటి మార్గం వుంది. భార్య, పిల్లలతో జీవిస్తున్నప్పటికీ ఆత్మజ్ఞానం పొందటం సాధ్యమే. ప్రపంచంలో జీవనం కొనసాగిస్తూ, తండ్రిగాను, ఇంకా ఇతర సంసార బాధ్యతలు నిర్వర్తిస్తూ కూడ ఆత్మజ్ఞానాన్ని మీరు పొందగలరు. మీకు దానిని ప్రసాదించగలుగుతున్న నేను కూడ నా వరకు నేను సంసార జీవనం కొనసాగిస్తున్నాను. ఆత్మజ్ఞానం తర్వాత కూడ మీరు స్వేచ్ఛగా కోరుకున్న విధంగా జీవించవచ్చు. సినిమాకి వెళ్లండి, పిల్లల వివాహం చేయండి. అందమైన వస్త్రాలు ధరించటం లాంటివి అన్నీ చేయండి. మీకు ఇంకా ఏ గ్యారంటీ కావాలి?

ప్రశ్నకర్త : నేను ఇటువంటి స్వేచ్ఛని కల్గి ఉంటూ కూడ ఆత్మజ్ఞానాన్ని పొందవచ్చునంటే ఇది చాలా విలువైనది. నాకు చాలా ఆసక్తిగా ఉంది.

దాదాశ్రీ : నీవు కోరినంత స్వేచ్ఛను పొందవచ్చు. ఇది ఆత్మజ్ఞానానికి షార్ట్‌కట్ మార్గము. ఈ మార్గంలో నీవు చేయవలసిన ప్రయత్నం ఏమీ ఉండదు. నేను మీ ఆత్మను మీ చేతుల్లో పెడతాను. ఇక మీకు మిగిలేది పరమసుఖాన్ని లేదా నిరతిశయ ఆనందాన్ని అనుభవించటమే. ఇది లిఫ్ట్‌మార్గము. నీవు లిఫ్ట్‌లో ఉండు (ఐతిహ్యమైన క్రమమార్గము, మెట్ల దారి కంటే మోక్షానికి ఇది దగ్గర దారి). వేరే కొత్త కర్మలు నిన్ను బంధించవు. నీవు చేయవలసినది నా ఆజ్ఞలను పాటించడం మాత్రమే; అందువల్ల ఇంకొక్క జన్మలోనే మీ కర్మలన్నీ పూర్తి అయ్యి ఫలితం లభిస్తుంది. ఈ మార్గంలో మీరు దారి తప్పిపోకుండా, విఘ్నాలు ఏమీ కలుగకుండా ఉండటం కోసం నేను మీకు ఈ ఆజ్ఞలు యిస్తాను.

ప్రశ్నకర్త : ఈ జ్ఞానం పొందిన తర్వాత నాకు ఇంకొక్క జన్మ ఉండటం తప్పదా?

దాదాశ్రీ : నీకు గతజన్మ వుంది, భవిష్యజన్మ కూడా ఉంటుంది. ఈ జ్ఞాన ప్రభావం ఎంతటిది అంటే అది ఒకటి లేక రెండు జన్మలలో మీకు మోక్షాన్ని ప్రసాదిస్తుంది. మొదట అజ్ఞానం నుంచి మోక్షం లభిస్తుంది. ఒకటి లేక రెండు జన్మల తర్వాత అంతిమ మోక్షం లభిస్తుంది. ప్రస్తుత కాలచక్రం కారణంగా నీవు ఇంకా ఒక జన్మను పొందవలసి వుంటుంది.

ఇంకోసారి తిరిగి నా వద్దకు రండి. మనం జ్ఞానవిధి తారీఖును నిర్ణయిద్దాం.

జ్ఞానవిధి యొక్క ఆ ప్రత్యేక దినాన అనంతజన్మల నుంచీ మిమ్మల్ని బంధించి ఉంచిన అజ్ఞానమనే త్రాళ్లను నేను తెగనరుకుతాను. ప్రతిరోజు వాటిని కోయవలసిన అవసరం లేదు. ఒకవేళ అలా చేయవలసి వుంటే మీరు రోజూ వెళ్లి రోజుకొక క్రొత్త బ్లేడు కొనవలసి ఉంటుంది. నిర్ణయించిన జ్ఞానవిధి రోజున నేను త్రాడు యొక్క ఒకే ఒక చుట్టును మాత్రమే కోస్తాను. అపుడు వెంటనే నీవు స్వేచ్ఛను పొందిన విషయాన్ని గుర్తిస్తావు. ఆ స్వేచ్ఛానుభూతి చాలు. అది కలకాలం నిలిచివుంటుంది. ఈ మోక్షం జోక్ కాదు. నిజంగానే నేను మిమ్ములను ముక్తులను చేస్తాను.

మీరు జ్ఞానం పొందే సమయంలో ఏమి జరుగుతుంది? జ్ఞానవిధి సమయంలో మూడు రకాల కర్మలలో రెండింటిని జ్ఞానాగ్ని దగ్ధం చేస్తుంది. మూడు రూపాల కర్మలను ఆవిరి, నీరు మరియు మంచుగడ్డతో పోల్చవచ్చు. జ్ఞానవిధి సమయంలో మొదటి రెండు రకాల కర్మలు (ఆవిరి మరియు నీరు) నాశనం చేయబడతాయి. అందువల్ల వారికి తాము తేలిక అయినట్లు అనుభూతి కలుగుతుంది, వారి జాగృతి కూడ పెరుగుతుంది.

ఇక మిగిలి వుండేది ఘనీభూతమైన (మంచుగడ్డ రూపంలోని) కర్మలు మాత్రమే. ఆకర్మఫలాన్ని (మంచి లేక చెడు ఏదైనా) మీరు అనుభవించి తీరాలి, ఎందువల్లనంటే అవి ఘనీభవించి ఉండటంతో పాటు ఫలాలను యివ్వటానికి సిద్ధంగా ఉన్నాయి. వాటిని మీరు తప్పించుకోలేరు. ఆవిరి మరియు నీటి రూపంలో ఉన్న కర్మలు జ్ఞానాగ్నిలో ఇగిరిపోతాయి. ఇది మీకు భారము తగ్గిన అనుభూతిని కల్గించి, జాగృతిని వృద్ధిచేస్తుంది. ఒకరి కర్మలు నాశనం గావింపబడనంతవరకు వారి జాగృతి వృద్ధి చెందదు. ఘనీభూతమైన కర్మలను మాత్రమే సహించవలసి వుంటుంది. ఈ ఘనీభూత కర్మలను తేలికగా సహించగలగటం కోసమూ, ఆ కర్మఫల తీవ్రతను తగ్గించటం కోసమూ మీకు అన్ని మార్గాలూ చూపాను. 'దాదా భగవాన్ కే అసీమ జయ జయ కార్‌హో' అని మరల మరల చెప్పండి; త్రిమంత్రము మరియు నవకల్మ్ చెప్పండి. (నవకల్మ్ కోసం పుస్తకం చివర చూడండి).

జ్ఞానవిధి సమయంలో ఈ తేలికపాటి కర్మలు (ఆవిరి, నీటి రూప కర్మలు) భస్మీభూతం కావటంతో పాటు అనేక ఆవరణలు (ఆత్మపై ఉన్న అజ్ఞానపు పొరలు) తొలగింపబడతాయి. ఆ సమయంలో దివ్యానుగ్రహం ద్వారా వారి ఆత్మ జాగృతమవుతుంది. ఒకసారి జాగృతమైన తర్వాత ఆ జాగృతి ఎప్పటికీ వదిలిపోదు. జాగృతితో పాటు నిరంతర ప్రతీతి (నేను శుద్ధాత్మను అనే దృఢ నిశ్చయం) ఉంటుంది. జాగృతి ఉన్నంత కాలమూ ప్రతీతి నిల్చి వుంటుంది. మొదట జాగృతి యొక్క అనుభవం కల్గుతుంది. తర్వాత ప్రతీతి వస్తుంది. ప్రతీతి అనగా "నేను శుద్ధాత్మను" అనే దృఢ విశ్వాసము. జ్ఞానవిధి వల్ల అనుభవం, లక్ష్యము (జాగృతి) మరియు ప్రతీతి (దృఢ విశ్వాసము) ఇవి మూడూ చోటు చేసుకుంటాయి. ప్రతీతి

స్థిరంగా వుంటుంది. కానీ లక్ష్యం చలిస్తూ అపుడపుడు స్వల్పకాలం పాటు పోతుంది. మనం పరధ్యానంగా ఉన్నపుడు లేదా మన పనులలో మునిగిపోయినపుడు ఆ పరిమిత కాలంలో మనం జాగృతిని కోల్పోవచ్చు కానీ ఏ క్షణం మనం మన పనులనుంచి విరామం పొందుతామో ఆక్షణం అది తిరిగి వస్తుంది.

లౌకిక వ్యవహారాలనుంచి, బాధ్యతలనుంచి విడుదలై ఏకాంతంలో కూర్చున్నపుడు పొందే అనుభవమే ఆత్మానుభూతి. ఈ అనుభవం క్రమక్రమంగా వృద్ధిపొందుతుంది. అందువల్ల ఇదివరకటి చందులాల్‌కి ఇప్పటి చందూలాల్‌కి ఉన్న తేడాను ఎవరైనా ఇట్టే గ్రహిస్తారు. ఈ మార్పుని ఎవరు తీసికొచ్చారు? ఆత్మానుభూతే దీనికి కారణం. ఇంతకు ముందు మీరు దేహాధ్యాసలో (భౌతిక దేహక్రియలు, దాని యొక్క ఉద్రిక్త స్వభావం మాత్రమే ఎరిగిన స్థితి) ఉండేవారు, కానీ యిప్పుడో ఆత్మలో స్థిరపర్చబడ్డారు.

ప్రశ్నకర్త : ఆత్మానుభూతి వల్ల ఏమి జరుగుతుంది?

దాదాశ్రీ : ఆత్మానుభూతి కలగటం వల్ల దేహాధ్యాస (దేహమే నేను అనే భ్రమ) తొలగిపోతుంది. ఎపుడు దేహాధ్యాస పోతుందో అపుడు కొత్త కర్మలు నిన్ను బంధించటం ఆగిపోతుంది. ఇంతకంటే నీ కేమి కావాలి?

ప్రశ్నకర్త : నాకు ఈ జ్ఞానమార్గాన్ని చూపవలసినదిగా మిమ్మల్ని కోరుతున్నాను.

దాదాశ్రీ : అవును. నీకు ఈ మార్గాన్ని చూపిస్తాను. నేను నీకీ మార్గాన్ని చూపటం మాత్రమే కాక నీ ఆత్మను నీ చేతుల్లోకూడ పెడతాను.

ప్రశ్నకర్త : అయితే నా మానవజన్మకి పరమార్థం చేకూరినట్లే. ఇంతకంటే నాకు కావలసినదేమున్నది?

దాదాశ్రీ : అవును. పూర్తిగా నెరవేరుతుంది. అనంత జన్మలలో స్వప్రయత్నంతో నీవు పొందలేని దానిని నేను ఒకే ఒక గంటలో నీకు ప్రసాదిస్తాను. అపుడొక మనిషిగా నీ లక్ష్యాన్ని సాధించినట్లు నీవు గ్రహిస్తావు. వేయి జన్మల కఠిన పరిశ్రమతో కూడ దీనిని నీవు సాధించలేవు.

# అంధకారాన్ని పారద్రోలుటకు ఎంతకాలం పడుతుంది?

ప్రశ్నకర్త : ఆత్మానుభూతిని పొందుటకు వేదాలలో అనేక మార్గాలు వివరించబడినవి. వివేకము, వైరాగ్యము, ముముక్షుత్వము అనే లక్షణాలను వ్యక్తి సాధించవలసి వుంటుంది. వీటి సాధనకు సమయము, ప్రయత్నము అవసరము. మరి ఇంత తక్కువ సమయంలో ఈ జ్ఞానాన్ని పొందటం ఎలా సాధ్యం?

దాదాశ్రీ : జ్ఞానాన్ని పొందటానికి సమయం పట్టదు. చీకటిగా వున్న గోతిలోనికి ఒక ఫ్లాష్‌లైట్‌ను త్రిప్పితే తక్షణమే చీకటి తొలగి వెలుగు కనిపిస్తుంది. అదే విధంగా, జ్ఞానప్రకాశంలో అజ్ఞానాంధకారాన్ని పారద్రోలుటకు జ్ఞాని పురుషునికి ఏమాత్రం సమయం పట్టదు. ఆ తర్వాత నువ్వు కాలు జారి పడవు.

ప్రశ్నకర్త : ఈ జ్ఞానాన్ని పొందే వ్యక్తి ఆధ్యాత్మికోన్నతిని కల్గి ఉండాలా?

దాదాశ్రీ : మనిషి గత అనేక జన్మలలో ఈ ఆధ్యాత్మిక స్థాయిని చేరి వున్నాడు. తన నిజ స్వరూప జ్ఞానం లేనందువల్ల అహంకారం అతనిని తప్పు దారి పట్టించింది. ఆధ్యాత్మిక స్థాయిలో అతడు అభివృద్ధి చెందిన కొద్దీ అతని అహంకారం మరింతగా బలపడింది. అతడు అభ్యసించిన వివేక వైరాగ్యాలు అతనిలో ఆధిక్య భావనను వృద్ధి చేయటానికి మాత్రమే పనికి వచ్చాయి. ఇదంతా ఎందుకు జరుగుతుంది? ఇంకా అతను కాలు జారి పడుతూనే వున్నాడు. అయినప్పటికీ "నేను ప్రత్యేకమైనవాడిని" అని చెప్పుకుంటూనే ఉన్నాడు. అతడు చాలా ఆధ్యాత్మిక సాధనలు చేసినప్పటికీ తన నిజస్వరూపాన్ని అనుభవ పూర్వకముగా తెలుసుకోలేదు.

నీ అస్తిత్వం (నీవు ఉన్నావనే జ్ఞానం) ఉంది. ఈ విషయంలో సందేహం లేదు. వస్తుత్వ జ్ఞానం (నీవెవరివి అనే జ్ఞానం) నీకు లేదు. ఎప్పుడు జ్ఞాని పురుషుడు నీ పాపాలను ప్రక్షాళనం చేస్తాడో అపుడు నీకు వస్తుత్వ జ్ఞానం (ఆత్మానుభూతి) లభిస్తుంది.ఒకసారి నీవు ఆత్మానుభూతి పొందితే అప్రయత్నంగా పూర్ణస్థితికి (పరిపూర్ణ పరమాత్మ దశ) అభివృద్ధి చెందుతావు. అపుడు నీవు ఏమీ చేయవలసినపని లేదు. నీవు స్వతంత్రుడవవుతావు. నీ దృష్టి కోణంలో మాత్రమే భేదం వస్తుంది. ఇపుడు నీ

దృష్టి కోణం వేరు, నా దృష్టి కోణం వేరు. నీ దృష్టి కోణాన్ని మార్చటం మాత్రమే నేను చేస్తాను. ఇది జ్ఞాని పురుషుని యొక్క పని. దివ్యానుగ్రహం లేకుండా ఇది సాధ్యం కాదు.

## ఆత్మకి అనాత్మకి మధ్య భేదరేఖ

ఈ అక్రమ విజ్ఞానం వల్లనే మీరు ఇంత తక్కువ సమయంలో సమకిత్ దశను (ఆత్మానుభూతిని) పొందగల్గుతున్నారు. ఈ కాలంలో పరంపరానుగతమైన క్రమమార్గం ద్వారా ఈ సమకిత్ స్థితిని పొందటం అసాధ్యం. అక్రమ విజ్ఞానము చాలా ఉన్నత విజ్ఞానము. అందువల్లనే ఇది ఆత్మ అనాత్మల మధ్య అనగా నీకు, నీవు కాని దానికి మధ్య చాలా స్పష్టమైన విభజనను చేస్తుంది. వాటి ధర్మాలను, గుణవిశేషాలను అక్రమ విజ్ఞానం స్పష్టంగా నిర్వచించింది. స్పష్టమైన ఈ భేదరేఖ కారణంగానే వెనువెంటనే అనుభవాత్మకమైన ఫలితం కలుగుతుంది. క్రమ మార్గంలో ఈ భేదరేఖ స్పష్టంగా నిర్వచింపబడని కారణంగా లక్ష్యాన్ని చేరటం చాలా కష్టం. ఒకసారి ఆత్మ అనాత్మల విభజన జరిగిన తర్వాత ఆత్మ ఎన్నడూ అనాత్మ కానేరదు; అనాత్మ ఎన్నడూ ఆత్మ కాజాలదు. వాటి విభజన జరగనంతవరకు అవి తమతమ స్వభావాలలో ఉండజాలవు.

## క్రమ మరియు అక్రమ మార్గాలు.

తీర్థంకరుల యొక్క జ్ఞానము క్రమజ్ఞానము, అనగా వారి పరిశ్రమ స్థాయిని బట్టి క్రమేపి అనుభూతిని పొందటం జరిగింది. వారి పరిగ్రహము (ఇది నాది అనే భావము) తగ్గుతున్న కొద్దీ మోక్షమార్గంలో పురోభివృద్ధి కలుగుతుంది. ఈ మార్గంలో లక్ష్యం చేరటానికి అనేక జన్మలు పడుతుంది.

కానీ యిది అక్రమ విజ్ఞానం. ఇక్కడ మెట్లు ఎక్కవలసిన అవసరం లేదు. లిఫ్ట్ ఎక్కి తేలికగా పన్నెండవ అంతస్తుకి వెళ్లవచ్చు. ఇదే అక్రమ మార్గం యొక్క ప్రత్యేకత. కేవలం లిఫ్ట్‌ని కనుక్కొని దానిలో ఎక్కితే చాలు. వారికి మోక్షం అరచేతిలో ఉంటుంది. మీకు ఈ మార్గాన్ని చూపటంలో లేదా సరైన దిశా నిర్దేశం చేయుటలో నేను కేవలం నిమిత్తమాత్రుణ్ణి. లిఫ్ట్‌లో ఎవరు ఎక్కినా అన్ని సమాధానాలు లభిస్తాయి. అందరూ

తప్పనిసరిగా సమాధానాలు పొందాలి. ఈ లిఫ్ట్‌లో ప్రవేశించాక, తాము మోక్షానికే ప్రయాణిస్తున్నట్లు వారికి ఎలా తెలుస్తుంది? మీ కోపము, దురాశ, లోభము, గర్వము అన్నీ వెళ్ళిపోవటమే మీకు నిదర్శనం. మానసిక వేదన తొలగిపోతుంది. అంతరంగంలో చింత (ఆర్తధ్యానము) అనేది ఇక ఉండదు. ఇతరులకు హాని కలిగించే రౌద్రధ్యానమూ ఉండదు. ఇదే మీకు నిశ్చయము. పని పూర్తి అయినట్లే అవునా?

ప్రశ్నకర్త : క్రమ మార్గం ప్రధానం మార్గం కాదా? ఈ అక్రమ మార్గం పూర్తిగా కొత్తది అవునా?

దాదాశ్రీ : అవును, క్రమమార్గం ప్రధాన మార్గం అయినప్పటికీ ఇది తపస్సు, త్యాగంవంటి వాటితో కూడి ఉన్నది. ఈ మార్గంలో లక్ష్యాన్ని చేరటానికి చాలా బాధలు పడవలసి వుంటుంది. వారి తపస్సు యొక్క స్థాయిపై వారి అభివృద్ధి ఆధారపడి ఉంటుంది. క్రమ మార్గం పూర్తిగా తపస్సుతో నిండి ఉన్నది.

ప్రశ్నకర్త : ఏ బాధలూ సహించకుండా, ఏ వేదన (శ్రమ) లేకుండా క్రమ మార్గంలో అభివృద్ధిని పొందలేరన్నది నిజమేనా?

దాదాశ్రీ : అవును, క్రమ మార్గం అత్యంతమూ బాహ్యంగానూ, ఆంతరంగికంగానూ కూడ బాధలతో కూడినది. ఇది బంగారాన్ని శుద్ధి చేయటం వంటిది. అగ్ని యొక్క వేడి (బాధలు) లేకుండా అది సాధ్యం కాదు. కొలిమిలో కాల్చినపుడే అది శుద్ధి అవుతుంది.

ప్రశ్నకర్త : క్రమమార్గంలో వలె అక్రమ మార్గంలో కూడ నియమాలున్నాయా?

దాదాశ్రీ : లేవు. ఎక్కడైతే నియమం ఉంటుందో, అది అనాత్మకి సంబంధించినదై ఉంటుంది. ఈ భంగిమలో కూర్చోవాలి అనే నియమం అనాత్మకి చెందినది. అక్రమ మార్గంలో ఏ నియమాలు లేవు. మోక్షానికి ఇంత సులువైన మార్గం ఉన్నప్పటికీ చాలా తక్కువమంది ముముక్షువులు దీని ప్రయోజనాన్ని పొందుతున్నారు.

ప్రశ్నకర్త : ఏ ప్రయత్నమూ లేకుండా మోక్షాన్ని పొందటం సాధ్యమే అని అంగీకరించుటకు మనసు ఒప్పుకోవటం లేదు. అందువల్లనే వారు తిరస్కరిస్తున్నారు.

దాదాశ్రీ : అవును, ఏమీ చేయకుండా దేనినైనా పొందటం ఎలా సాధ్యం అని వారు ప్రశ్నిస్తారు. క్రోధమానమాయాలోభాలకు, రాగద్వేషాలకు నీకు నీవే స్వయంగా బందీవై వుండగా ఏ ప్రయత్నమైన చేయమని నేను నీకు చెప్పినప్పటికీ నీవు ఎలా చేయగలుగుతావు? నీవు బంధింపబడిన ఖైదీవి. నీ బంధాలను నీవే ఎలా విడిపించుకోగలవు? ఈ రోజుల్లో ఎవ్వరికీ తపస్సు చేసే శక్తి లేదు. మీకు ఈ క్రొత్త సరళ అక్రమ మార్గాన్ని చూపుటకే నేను ఇక్కడ ఉన్నాను. మీకు నేను ఈ అక్రమ మార్గాన్ని యివ్వటం మాత్రమేకాక, భారమైన తపశ్చర్యల అవసరం లేకుండా పరంపరానుగతమైన క్రమమార్గాన్ని  కూడ సరళతరం చేస్తున్నాను.

ప్రశ్నకర్త : క్రమమార్గం కూడ సరళం అవుతుందా?

దాదాశ్రీ : అవును, మేము క్రమమార్గాన్ని సరళతరం కూడ చేస్తాము. ఈ అక్రమ మార్గం పరిమితకాలం వరకు మాత్రమే తెరవబడి అందుబాటులో ఉంటుంది. ఈ మార్గం సాటిలేనిది. ఇది దివ్యానుగ్రహం నుంచి ప్రత్యక్షంగా లభించింది. తీర్థంకరుల కాలంలో ఎంతో మంది ప్రజలు ప్రత్యక్ష దివ్యానుగ్రహానికి పాత్రులయ్యారు. ఆ రోజుల్లో ఆ అనుగ్రహం తమపై ప్రసరించాలంటే ప్రజలు దివ్య దర్శన, అనుగ్రహాలకై పరితపిస్తూ రహదారిలో ఎంతగానో నిరీక్షించవలసి వచ్చేది. కానీ యిపుడు ఆదివ్యానుగ్రహం మీపై ప్రసరించ సిద్ధంగా ఉన్నప్పటికీ (మీకు దానిపై కోరిక, శ్రద్ధ లేనందువల్ల) వెళ్లకుండా ఉండటం కోసం మీరు ఏవో సాకులు చూపుతున్నారు. కానీ యిది అక్రమమార్గం. ప్రాపంచిక జీవనం సాగిస్తూనే మోక్షాన్ని పొందటం ఈ మార్గంలో సాధ్యమవుతుంది.

ఇది మీకు చిట్ట చివరి పాస్‌పోర్ట్ (కడపటి అవకాశం). దీనిని జారవిడుచుకుంటే ఇటువంటి పాస్‌పోర్ట్ ఎప్పటికీ లభించదు. దీని సమయం ముగిసిపోబోతుంది. కనుక కలకాలం ఇది లభించేది కాదు. ఆ తర్వాత ధర్మం మాత్రమే మిగిలివుంటుంది. ధర్మం ద్వారా (శుభ కర్మాచరణ) పుణ్యాన్ని ఆర్జించి, కార్యకారణ సంబంధమైన జనన మరణ చక్రంలో పడవలసి వుంటుంది. అనగా ఈ జన్మలో ఆర్జించిన పుణ్యాన్ని మరు జన్మలో, మరుజన్మ పుణ్యార్జన ఫలాన్ని ఆ తర్వాతి జన్మలో అలా అనుభవిస్తూనే ఉండాలి. ఈ మార్గంలో ఆధ్యాత్మికంగా దిగజారటానికి అవకాశం చాలా ఎక్కువ.

## ఎవరు నన్ను కలుస్తారో వారు అక్రమజ్ఞానానికి అర్హులు.

ప్రశ్నకర్త : ఈ సరళ మార్గాన్ని పొందటానికై మేము ఏ విధమైన అర్హతలూ కల్గియుండవలసిన అవసరం లేదా ?

దాదాశ్రీ : కొంతమంది నన్ను "ఈ అక్రమ జ్ఞానం పొందటానికి నేను అర్హుడినేనా" అని అడుగుతుంటారు. "నన్ను కలుసుకోవటమే మీ అర్హత" అని నేను వారికి చెప్తాను. ఈ కలయిక సైంటిఫిక్ సర్కమ్‌స్టెన్షియల్ ఎవిడెన్స్ కారణంగా జరుగుతుంది. అందువల్ల నన్ను కలిసినవారెవరైనా అర్హులే. ఎవరు నన్ను కలవలేదో వారు అనర్హులు. మీరు నన్ను కలవటం వెనుక ఉన్న కారణం ఏమిటి ? మీ అర్హత కారణం గానే ఈ కలయిక సంభవించింది. ఏమైనప్పటికీ ఒకరు నన్ను కలిసినతర్వాత కూడ ఆత్మానుభూతిని పొందకపోయినట్లయితే, అపుడు దానికి కారణం అతని అంతరాయ కర్మ అతని కార్యసిద్ధిని నిరోధించటమే.

## అంతిమ లక్ష్యం.

ప్రశ్నకర్త : ఇది ఒక విధమైన దగ్గరిదారా ?

దాదాశ్రీ : అవును, ఇది నిశ్చయంగా దగ్గరిదారి. ఇది సూటియైన మార్గం.

ప్రశ్నకర్త : దీని అంతిమ లక్ష్యం ఏమిటి?

దాదాశ్రీ : శాశ్వతమైన ఆనందాన్ని, సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని, బంధాలనుంచి స్వేఛ్ఛను పొందటం దీని అంతిమ లక్ష్యం.

ప్రశ్న కర్త : శాశ్వతానందం అంటే ఏమటి ? దానిని వివరించగలరా?

దాదాశ్రీ : నీవు దానికై ఏ ప్రయత్నమూ చేయకుండానే నీకు అత్యంత సహజంగా లభించే ఆనందం శాశ్వతానందం. ఇది శాశ్వతంగా నిలిచి వుంటుంది. ఇందులో దు:ఖము లేక బాధ ఉండదు.

## క్రమ, అక్రమ మార్గాల మధ్య వ్యత్యాసము

దాదాశ్రీ : క్రమ, అక్రమ మార్గాల మధ్య భేదాన్ని వివరించమని కొంత మంది కోరారు. క్రమ మార్గంలో చెడుపనులు చేయటం ఆపాలనీ, మంచి పనులు చేయాలనీ

చెప్పబడుతుంది. క్రమ మార్గంలో కొన్ని పనులను తప్పనిసరిగా చేయవలసిందిగా సాధకులకు చెప్పటం జరుగుతుంది. మీ బలహీనతలైన క్రోధ మాన మాయా లోభాలనుంచి మీరు విముక్తి పొందాలనీ, మంచి విషయాలవైపు మరలమనీ మీకు బోధించటం జరుగుతుంది. ఇంతకాలం ఇదేకదా మీకు ఎదురైన అనుభవం? అక్రమ మార్గం విషయానికొస్తే మీరు చేయవలసింది ఏమీ లేదు. ఏమీ చేయనవసరం లేదు. ఎపుడైన ఎవరైన మీ జేబు కత్తిరించినప్పటికీ అక్రమ విజ్ఞానం ప్రకారం మీ అవగాహన ఇలా ఉంటుంది. "అతను జేబు కత్తిరించలేదు. మరియు కత్తిరించబడిన జేబు నాది కాదు''. కానీ క్రమ మార్గంలో జేబు కత్తిరించిన వారిని దోషిగా చూసి నిందించటం జరుగుతుంది. మరియు "అతడు కత్తిరించింది నా జేబు'' అనే నమ్మకం ఉంటుంది.

అక్రమ విజ్ఞానం ఒక లాటరీ వంటిది. నీవు లాటరీ గెల్చినపుడు అక్కడ నీ ప్రయత్నం ఏమైనా ఉంటుందా? ఎంతోమంది లాటరీ టిక్కెట్లు కొన్నారు. కానీ విజేతవు నీవు మాత్రమే. అదే విధంగా ఈ అక్రమ విజ్ఞానం రెడీ క్యాష్ వలె మోక్షాన్ని ప్రసాదిస్తుంది.

## అక్రమ మార్గానుభూతి

ప్రశ్నకర్త : ఎవరైనా అక్రమ విజ్ఞానాన్ని వారి గతజన్మ కర్మల కారణంగా పొందుతారా?

దాదాశ్రీ : అవును. వారి కర్మఫల కారణంగానే ఎవరైనా నన్ను కలవగలుగుతారు. లక్షల కొద్దీ జన్మల పుణ్య సంచయం వల్లనే వారికి ఇటువంటి మార్గం లభిస్తుంది.

మిగిలినవన్నీ క్రమ మార్గాలు. క్రమ మార్గం అంటే అనాత్మ మార్గం. ఆ మార్గం ప్రాపంచిక లాభాలను చేకూరుస్తుంది. ఒక్కొక్క మెట్టుగా చాలా నెమ్మదిగా మిమ్మల్ని మోక్షం వైపు తీసుకెళ్తుంది. ఈ మార్గంలో త్యాగం మరియు తపస్సు ద్వారా సాధకులు తమ అహంకారాన్ని తామే శుద్ధిచేసికొనవలసి వుంటుంది. ఒకసారి ఈ అహంకారం శుద్ధి అయితే అది మోక్ష ద్వారం వద్ద వుంటుంది. క్రోధం, గర్వం, మాయ, దురాశ, లోభం అనే బలహీనతల నుంచి అహంకారం శుద్ధి చేయబడాలి. క్రమమార్గం చాలా సంక్లిష్టమైన మార్గం. అక్రమ మార్గంలో జ్ఞాని పురుషుడు మీ కోసం మీ అహంకారాన్ని

శుద్ధి చేస్తాడు. మీ అహంకారాన్నీ, మమకారాన్నీ రెంటిని అతడు తొలగిస్తాడు. అపుడు మీరు శుద్ధాత్మానుభావాన్ని పొందుతారు. మీ ఆత్మానుభూతి మీకు కల్గిన తర్వాత మాత్రమే మీ పని పూర్తవుతుంది.

## అక్రమ మార్గం ఎందుకు ఏర్పడింది?

క్రమ మార్గం ఒక 'కామా' మరియు అక్రమ మార్గం ఒక 'ఫుల్ స్టాప్'. ఈ అక్రమ మార్గం అరుదుగా దానంతట అదే అభివ్యక్తమౌతుంది. మోక్షానికి ప్రధాన మార్గం క్రమ మార్గం, మెట్టు తర్వాత మెట్టుగా వెళ్ళే మార్గం. కొన్నిసార్లు పరంపరానుగతమైన క్రమ మార్గంలో కలతలు లేక భ్రమలు చోటు చేసికొన్నప్పుడు, మరియు ఆ సమయంలో మోక్షానికి సిద్ధంగా అర్హతను పొందిన ప్రజలెవరైనా ఉన్నచో వారు జ్ఞాని పురుషుని ద్వారా ముక్తిని కనుగొంటారు.

నా ద్వారా అక్రమమార్గం ఎందుకు వెలుగులోనికి వచ్చిందని చాలామంది బోధకులు, గురువులు నన్ను అడిగారు. క్రమమార్గం బీటలు వారినందున అక్రమమార్గం అభివ్యక్తమైందని నేను వారికి చెప్పాను. క్రమమార్గం యొక్క పునాది పూర్తిగా చెడిపోయింది.అందుకు ఋజువేమిటని వారు అడిగారు. అపుడు నేను వారితో మనోవచనకాయాల ఏకత ఉన్నపుడు మాత్రమే క్రమమార్గం జీవించగలుగుతుందని చెప్పాను (అనగా నీ మనసులో ఉన్న దానిని ఉన్నట్లుగా నీవు చెప్పినపుడు, మరియు నీ ప్రవర్తన నీ మనసుతో, వాక్కుతో ఏకీభవించినపుడు). ప్రస్తుత కాలంలో మనోవచనకాయాల ఏకత లోపించిందని వారు అంగీకరించారు. ఆ కారణంగానే క్రమమార్గం ఫ్రాక్చరైంది.

ఒక చెరుకు గడను నీవు పూర్తిగా తిన్నట్లయితే దానిలో రెండు కణుపులలో మంచి చెరుకురసం నీకు లభించవచ్చు. అలాకాక చెరుకు గడ పూర్తిగా కుళ్ళిపోయి వుంటే నీవు దానిని నమల ప్రయత్నిస్తావా లేక తిరిగి యిచ్చేస్తావా?

ప్రశ్నకర్త : తిరిగి యిచ్చేస్తాను.

దాదాశ్రీ : దానిని తిరిగి తీసికొమ్మని, ఇంకెవరికైనా యివ్వమని నువ్వు అమ్మకం దారుకి చెప్తావు. చాలా చెరుకు తిన్నట్లుగా కూడ నీవు అతనికి చెప్తావు. ఈ క్రమ మార్గం కుళ్ళిన చెరుకులా తయారైంది. ఎవరు మాత్రం ఏమి చేయగలరు? ప్రజలు

చిక్కుల్లో, భ్రమల్లో తగుల్కొన్నారు. వారు అలౌకిక విషయాన్ని ఏ మాత్రం పట్టించుకోవటం లేదు. ప్రాపంచిక సుఖాలను ఎలా అనుభవించాలా అనేది మాత్రమే వారి లక్ష్యమైంది.

ఎవరైనా మనోవచనకాయాల ఏకతను కల్గి యున్నట్లయితే వారు క్రమ మార్గంలో అభివృద్ధి చెందగలరు. లేనిచో ఆ మార్గం నిష్ప్రయోజనం.

## అక్రమ మార్గం.

ప్రస్తుతకాలంలో క్రమమార్గం యొక్క పునాది సమూలంగా శిథిలమైపోతున్నది. ఫలితంగా ఈ అక్రమమార్గం అభివ్యక్తమైంది. అక్రమమార్గం స్వతంత్రంగా అభివ్యక్తంకాదు. క్రమమార్గం దానంత అది రిపేరు కావటానికి మూడు వేల సంవత్సరాల వరకూ పడుతుంది. అప్పటివరకు అక్రమ మార్గం ఉంటుంది. క్రమమార్గం తిరిగి స్వస్థతను పొందిన తర్వాత, అక్రమమార్గం యొక్క ఆవశ్యకత ఉండదు. ఈ అక్రమ విజ్ఞానం శాశ్వతంగా ఉండబోదు. క్రమమార్గం స్థానంలో ఇది వ్యక్తమైంది.

ప్రశ్నకర్త : మీరు లిఫ్ట్‌ను నిర్మించబోతున్నారా?

దాదాశ్రీ : అవును. నిజంగా ఇది ఒక లిఫ్ట్. నేను ప్రజలకు మెట్లెక్కమని చెప్పినట్లయితే దానికై వారికి శాశ్వతకాలం పడుతుంది. అందువల్ల నేను దాదాయొక్క లిఫ్టులో కూర్చోమని ఆహ్వానించాను. భోగభాగ్యాలలో, సుఖాలలో జీవించే ఈ ధనవంతులు కూడ నన్ను వదలరు.

## అక్రమవిజ్ఞానం ద్వారా అమూల్యమైన మార్పు

అక్రమవిజ్ఞానం ఒక ఆశ్చర్యం. ఈ జ్ఞానాన్ని పొందిన తర్వాత మనుష్యులు వెంటనే చెప్పుకోదగిన మార్పుని అనుభూతి చెందుతారు. ఈ అనుభవం గురించి విన్న ప్రజలు ఈ మార్గానికి ఆకర్షితులౌతారు. ఈ జ్ఞానాన్ని పొందిన ఈ ప్రజలందరినీ తమ అనుభవాల గురించి వ్రాయమని నేను ఉపదేశించాను ; దాదాని కలవక ముందు వారెలా ఉండేవారు, దాదాని కలిసిన తర్వాత ఏ మార్పులను అనుభూతి చెందారు అనేవి వ్రాయమన్నాను.

ఈ అనుభవాలను చదివిన ప్రపంచం ఆశ్చర్యపోవటం తథ్యం. ఒక వ్యక్తి అంత సడెన్‌గా ఎలా మారగలడు? వేలకొద్దీ ప్రజలు తమ జీవితాల్లో ఈ స్పష్టమైన మార్పులను అనుభూతి చెందారు. ఈ మార్పులు శాశ్వతమైనవి. ఈ జ్ఞానానంతరం ఈ ప్రజలు తమలో దాగి ఉన్న తప్పుల్ని మాత్రమే తాము చూచుకొంటారు, వీరు యితరుల దోషాలను చూడరు. ఏ జీవికీ అణుమాత్రమైన హానిచేసే తలంపు వీరికి కలగదు.

## ప్రపంచ వ్యాప్తంగా అక్రమవిజ్ఞానం

ఇది చిరస్మరణీయమైన అపూర్వ సంఘటన. వేరే ఎక్కడా ఇది జరగలేదు. దాదాజీ మాత్రమే దీనిని నెరవేర్చగలిగారు.

ప్రశ్నకర్త : దాదా! మీ తదనంతరం ఏమి జరుగుతుంది?

దాదాశ్రీ : ఇది కొనసాగుతుంది. అర్హత పొందినవారు ఈ పనిని కొనసాగించాలనేది నా కోరిక. ఎవరో ఒకరు ఈ మార్గాన్ని కొనసాగించవలసిన అవసరం లేదా?

ప్రశ్నకర్త : ఆ అవసరం ఉంది.

దాదాశ్రీ : నా కోరిక నెరవేరుతుంది.

ప్రశ్నకర్త : ఈ అక్రమ మార్గం కొనసాగినట్లయితే ఇది ఇంకొక నిమిత్తుని ద్వారా జరుగుతుందా?

దాదాశ్రీ : అక్రమ విజ్ఞానం మాత్రమే కొనసాగుతుంది. అక్రమ విజ్ఞానం యొక్క ప్రయోజనం విశ్వవ్యాప్తమవుతుంది. ఒకటి రెండు సంవత్సరాలు ఇది ఇలాగే కొనసాగితే ప్రపంచమంతా దీని గురించే చెప్పుకొంటుంటారు. ఒక మంచి విషయం, ఒక చెడు విషయం రెండు ఉన్నట్లయితే వాటిలో మంచి విషయాన్ని అమలు పరచటానికి ఎక్కువ సమయం పడుతుంది. కానీ చెడును అమలు పరచటానికి ఏ మాత్రం సమయం పట్టదు. వెంటనే అమలు పరచవచ్చు. చెడు వ్యాపించినంత శీఘ్రంగా మంచి వ్యాపించదు. దాని కోసం కొంత సమయం పడుతుంది.

## అక్రమ జ్ఞానం ద్వారా స్త్రీలకు మోక్షం.

పురుషులు మాత్రమే మోక్షాన్ని పొందగలరని, స్త్రీలకు మోక్షం లేదని ప్రజలు చెప్తారు. నేను చెప్పేదేమంటే స్త్రీలకు కూడ రూఢిగా మోక్షం ఉంది. ఎందుకు లేదు? స్త్రీల ప్రకృతిలో మోహము, కపటము అనే లక్షణాలు చాలా ఎక్కువగా వున్నందున వారికి మోక్షం లేదని ప్రజలు చెప్తారు. అదే బలహీనత పురుషులలో కూడ కనిపిస్తుంది. కానీ స్త్రీలలో అది కొంచెం ఎక్కువ డిగ్రీలో వుంటుంది.

ప్రజలు ఏమి చెప్పినప్పటికీ స్త్రీలు తప్పక మోక్షాన్ని పొందుతారు. వారికి మోక్షార్హత ఉంది, ఎందుకంటే వారు వాస్తవంగా ఆత్మ స్వరూపులు. వారిలో మోహము, కపటము అధిక స్థాయిలో ఉన్నందున వారికి కొంత ఎక్కువ కాలం పట్టవచ్చు.

## స్వరూప విజ్ఞానం ద్వారా స్వేచ్ఛ

ఈ మార్గం పూర్తిగా ఆత్మవిషయకము. ఈ మార్గంలో అనాత్మ విభాగం (అశాశ్వతము మరియు మనోవాక్కాయములకు సంబంధించినది) లేదు. ఆత్మ అనగా తలంపులు, వాక్కు మరియు క్రియలతో కూడిన ప్రపంచానికి అతీతమైనది. అనాత్మ అనగా ప్రాపంచికమైనది మరియు మనోవాక్కాయముల అధీనము. అన్ని విధాల ప్రయత్నించి కూడ ముక్తికి మార్గం కన్పించని వారి కోసమే ఈ విజ్ఞానమార్గం. ముముక్షువులు కాని వారికి ఇతర నియమాలు, మార్గాలు ఉండనే ఉన్నాయి. అక్రమమార్గం అన్ని నియమాలనుంచి ముక్తులు కాగోరే వారి కోసమే ఉద్దేశింపబడింది.

ఇది ఆంతరంగిక విజ్ఞానము మరియు శాశ్వతమైనది. ఈ ప్రపంచంలో మీకు కన్పించేదంతా బాహ్య విజ్ఞానము మరియు తాత్కాలికమైనది. ఈ విజ్ఞానం మీకు శాశ్వతానుభూతిని ప్రసాదిస్తుంది. ఇది పూర్ణ విజ్ఞానము. ఈ విజ్ఞానము ముక్తులను చేస్తుంది. మీరు అభ్యసించే ఏ ధర్మమూ మీకు మోక్షాన్నివ్వదు. ధర్మాచరణ ద్వారా మీరు విషయానందాన్ని మరియు అధర్మ మార్గంలో పడకుండా రక్షణను పొందవచ్చు. ఆధ్యాత్మికపురోగతి నుంచి చ్యుతినందకుండా ధర్మం మిమ్మల్ని రక్షిస్తుంది. మోక్షార్థము మీకు వీతరాగ విజ్ఞానము (సంపూర్ణ విజ్ఞానము) అవసరము. ఈ విజ్ఞానము ఏ గ్రంధాలలోను లభించదు. తీర్థంకరులకు ఈ విజ్ఞానము గురించి తెలుసు కాని వారి కాలంలోని ప్రజలకు వారు దానిని అందించలేకపోయారు. ఈ క్లిష్టసమయంలో అరుదైన

ఒక భేద విజ్ఞాని ('నేను' మరియు 'నాది' వీటిని విభజించే పరిపూర్ణ శాస్త్రజ్ఞుడు) ఈ విజ్ఞానాన్ని ప్రతి ఒక్కరికీ అందుబాటులో ఉంచాడు.

అందువల్ల నువ్వు ఏమి కోరినా యివ్వటానికి నేను సిద్ధంగా ఉన్నాను. ఏమి కోరుకున్నా సరే. నిర్వికల్ప సమాధిని కోరుకో (జీవితంలో అన్ని బాధ్యతలూ నిర్వర్తిస్తూనే నిరంతరాయంగా నిరంతర ఆత్మానందానుభూతి). వేదన, చింతలు లేని శాశ్వతస్థితిని కోరుకో. నేను నీకు గ్యారంటీగా వీటినన్నింటినీ యిస్తాను. నీకు కావలసినది ఏదైనా అడుగు కాని ఏమి కోరుకోవాలో నీవు తెలుసుకోవాలి. ప్రపంచ వ్యవహారాల మధ్య జీవిస్తున్నప్పటికీ కూడ ఈ విజ్ఞానం నీకు స్వేచ్ఛని ప్రసాదిస్తుంది.

## నీ పని పూర్తి చేసుకో.

నీపని పూర్తిచేసుకో. నీకు ఎపుడు దీని అవసరమైతే అప్పుడు ఇక్కడకు రా. నిన్ను రమ్మని నేను నిర్బంధించటం లేదు. నీకు రావాలని అనిపిస్తేనే రా. నీకు ప్రాపంచిక జీవనమూ, యధాతథంగా ఆవిషయాలు యిష్టమైతే నీవు యిప్పటిలాగే కొనసాగు. ఈ మార్గాన్ని అనుసరించమని నీపై ఏ ఒత్తిడీ లేదు. నిన్ను రమ్మని ఆహ్వానిస్తూ ఉత్తరాలు వ్రాయటానికి కాదు నేనిక్కడ ఉన్నది. నీవు నన్ను కలవటం జరిగితే, అపుడు నేను నీకు ఈ జ్ఞానం గురించి చెప్పి దానిలాభాన్ని పొంది పనిపూర్తిచేసుకోమని సలహా యిస్తాను. ఇంతమాత్రమే నేను మీకు చెప్తాను. కొన్నివేల సంవత్సరాలపాటు ఇటువంటి విజ్ఞానం అందుబాటులో లేదు.

## (9) జ్ఞాని పురుషుడు ఎవరు?

## సంత్ పురుషుడు : జ్ఞాని పురుషుడు

ప్రశ్నకర్త : సంత్ పురుషుడు (ఋషి, ముని) మరియు జ్ఞాని పురుషుడు వీరికి గల భేదమేమి?

దాదాశ్రీ : చెడు కర్మలను వదలి పెట్టమని మంచి కర్మలను చేయమని ప్రజలకు ఎవరు బోధిస్తారో అట్టి పవిత్రులు సంత్‌పురుషులు.

ప్రశ్నకర్త : అయితే ఎవరు మమ్మొలను పాపకర్మల నుంచి కాపాడతారో వారు సంత్‌పురుషులని చెప్పబడతారా?

దాదాశ్రీ : అవును, సంత్‌పురుషుడు నిన్ను పాపకర్మలనుంచి రక్షిస్తాడు, కాని జ్ఞాని పురుషుడు పుణ్యాపాపాలనే రెండు కర్మలనుంచి నిన్ను రక్షిస్తాడు. సంత్‌పురుషుడు నిన్ను సన్మార్గంలో నడిపిస్తాడు. కాని జ్ఞానిపురుషుడో నిన్ను ముక్తుణ్ణి చేస్తాడు. ఒక ప్రత్యేక మార్గంలో ప్రయాణించేవారు సంత్‌పురుషులు. వారు స్వయంగా ఒక మార్గంలో నడుస్తూ ఇతరులను కూడ తమతోపాటు నడవవలసినదిగా ప్రోత్సహిస్తారు. కానీ జ్ఞానిపురుషుడే అంతిమ గమ్యస్థానము. అతడు మాత్రమే నీపని పూర్తిచేయగలడు.

సంత్ పురుషులు వివిధ స్థాయిలలోని బోధకులు, ఉదాహరణకి కిండర్‌గార్డెన్‌వారికి, ఫస్ట్‌స్టాండర్డ్ వారికి, సెకండ్ స్టాండర్డ్‌వారికి వగైరా. కాని జ్ఞానిపురుషుడు మాత్రమే నీకు పూర్తి ముక్తిని ప్రసాదించగలడు. జ్ఞాని పురుషుడు చాలా అరుదుగా లభిస్తాడు.

సంత్‌పురుషులు అనాత్మస్థాయిలో ఆనందాన్నివ్వగలరు. జ్ఞానిపురుషుడు ఆత్మయొక్క స్వభావ సహజమైన శాశ్వతానందాన్ని మీకు ప్రసాదించగలడు. అతడు మీకు శాశ్వత శాంతిని అనుగ్రహిస్తాడు.

ఏ విషయంపైన, దేనిమీద ఏమాత్రం మమకారము లేనివాడే నిజమైన సంత్‌పురుషుడు. విభిన్న స్థాయిలలో మమకారాన్ని కలిగి ఉన్నవారు కూడ కొందరున్నారు. జ్ఞాని పురుషుడెవరు? ఎవరికి అహంకార మమకారములు లేవో అతడే జ్ఞాని.

అందువల్ల నీవు సంత్‌ని జ్ఞానిపురుషునిగా పేర్కొనకూడదు. సంత్ ఆత్మానుభూతిని పొందినవాడు కాదు. అయినప్పటికీ, జ్ఞాని పురుషుని కలిసినపుడు సంత్‌కూడ ఆధ్యాత్మిక ఉన్నతిని పొందుతాడు. సంత్‌కి కూడ జ్ఞాని పురుషుని కలవవలసిన అవసరం వుంది. మోక్షేచ్ఛగలవారెవరైనా సరే జ్ఞానిపురుషుని దర్శించాలి. వేరే మార్గం లేదు.

జ్ఞాని పురుషుడు ప్రపంచం యొక్క నిజమైన ఒక ఆశ్చర్యము. ఆత్మ యొక్క అభివ్యక్తీకరణయే జ్ఞానిపురుషుడు.

## జ్ఞాని పురుషుని గుర్తించుట.

ప్రశ్నకర్త : మీరు జ్ఞాని పురుషుని ఎలా గుర్తించగలరు?

దాదాశ్రీ : జ్ఞాని పురుషుడు దాగి ఉండలేడు. అతని పరిమళము, ప్రకాశము పూర్తి

స్పష్టతను కల్గియుంటాయి. అతని పరిసరాలు ప్రసిద్ధికెక్కుతాయి. అతని వాణి అసాధారణమైన ప్రత్యేకతను కల్గి ఉంటుంది. అతని మాటల ద్వారా మీరు అతనిని గుర్తించవచ్చు. అతని కళ్లలోకి చూడటం ద్వారా కూడ మీరు అతడిని జ్ఞాని అని చెప్పగలరు. వివాదములకు తావులేని ప్రామాణిక చిహ్నములెన్నింటినో జ్ఞాని కలిగి వుంటాడు. అతని ప్రతి మాటా ఒక వేదము. అతని వాణి, వర్తన, వినయము ఎంతో మనోజ్ఞమై మిమ్ము గెలుచుకుంటాయి. అతడు చాలా విలక్షణమైన గుణములు కలిగివుంటాడు.

జ్ఞాని పురుషుని గుణ విశేషము లేమి? సూర్యునికాంతి, చంద్రుని చల్లదనము అతని ప్రకృతిలో భాగము. ఈ రెండు వ్యతిరేకగుణాలు కలిసి ఉండటం జ్ఞానిలో మాత్రమే కన్పిస్తుంది. జ్ఞానిలో కాక ప్రపంచంలో మరెక్కడా అట్టి ముక్త మందహాసాన్ని దర్శించలేరు. అతని ప్రశాంత మందహాసము ఇతరులను తమ దు:ఖాల్ని మరిపింపజేస్తుంది.

అహంకార పూరిత బుద్ధి జ్ఞానిలో లేశమాత్రం ఉండదు. జ్ఞానిపురుషుడు అబుధ్ (బుద్ధి శూన్యమైన స్థితి) అయి వుంటాడు. ఇటువంటి వారు మనచుట్టూ ఎంతమంది ఉంటారు? ఎప్పుడో అరుదుగా ఇటువంటి వ్యక్తి జన్మించినపుడు అతడు వేలకొద్దీ ప్రజల్ని ముక్తుల్ని చేస్తాడు. జ్ఞాని పురుషునిలో అతిసూక్ష్మ పరిమాణంలో కూడ అహంకారం ఉండదు. జ్ఞానిపురుషుడు కాక అహంకార రహితుడైన వ్యక్తి ఒక్కరు కూడ ఈ ప్రపంచంలో లేరు.

అరుదుగా, కొన్నివేల సంవత్సరముల కొకసారి, ఒక జ్ఞాని పురుషుడు జన్మిస్తాడు. సంత్‌లు, శాస్త్ర పాండిత్యం గలవారు చాలామంది వున్నారు. కాని ఆత్మానుభూతిని పొందినవారు లేరు. జ్ఞానులు ఆత్మను గురించి పూర్ణజ్ఞానం కల్గి వుంటారు. ఆత్మజ్ఞాని పరమసుఖి, అతనిని ఏ విధమైన బాహ్యాంతరదు:ఖం స్పృశించలేదు. అటువంటి వ్యక్తి సాన్నిధ్యంలో మీరు కూడ ముక్తి పొందగలరు. సద్వస్తువును గుర్తించినవారే ఇతరులు కూడ దానిని గుర్తించటంలో సహాయపడగలరు. ఒక జ్ఞాని సహాయం లేకుండా ఆత్మజ్ఞానాన్ని పొందటం అసాధ్యం.

# (10) దాదా భగవాన్ ఎవరు?
# 'నేను' మరియు 'దాదా భగవాన్', ఒకరు కాదు

ప్రశ్నకర్త : మిమ్ములను భగవాన్ (దైవం) గా సంబోధించటాన్ని మీరు ఎందుకు అనుమతిస్తున్నారు?

దాదాశ్రీ : నేను భగవంతుణ్ణి కాను. నాలో ఉన్న దాదా భగవాన్‌కి నేను కూడ నమస్కరిస్తాను. నా ఆధ్యాత్మిక జ్ఞానము $356^0$వద్ద ఉన్నది ; దాదా భగవాన్ $360^0$ వద్ద ఉన్నారు. నేను నాలుగు డిగ్రీలు తక్కువలో ఉన్నందున నేను కూడ నాలో ఉన్న దాదా భగవాన్‌కి శిరస్సు వంచి ప్రణమిల్లుతాను.

ప్రశ్నకర్త : మీ రెందుకు ఈ పని చేయాలి?

దాదాశ్రీ : నేను మిగిలిన నాలుగు డిగ్రీలు పూర్తి చేయగోరుతున్నాను కనుక నేను అలా చేస్తాను. నేను ఆ నాలుగు డిగ్రీలు పూర్తి చేయవలసి వున్నది. నాలుగు డిగ్రీలు తక్కువైనందున నేను ఫెయిల్ అయ్యాను. తర్వాతసారి పాస్ కావటం తప్ప నాకు ముక్తికి మార్గం లేదు.

ప్రశ్నకర్త : మీకు భగవంతుడిగా ఉండాలన్న కోరిక ఉందా?

దాదాశ్రీ : భగవాన్‌గా ఉండటం నాకు భారంగా ఉంటుంది. నేను లఘూత్తమ (ఎవరైతే ప్రపంచంలోని ప్రతిదీ నిజంగా తనకంటే చాలా ఉన్నతమైనది అని తలుస్తారో వారు - అహంకార రహిత స్థితి) పురుషుణ్ణి. నాకంటె అల్పమైన ప్రాణి వేరే ఏదీ లేదు, అందువల్ల భగవంతుణ్ణి కావటం నాకు భారంగా వుంటుంది.

ప్రశ్నకర్త : భగవంతునిగా ఉండాలని కోరుకోనప్పుడు, నాలుగు డిగ్రీలు పూర్తి చేయాలని ఎందుకు ప్రయత్నించాలి?

దాదాశ్రీ : అది నా అంతిమ ముక్తి కోసం. 'భగవాన్' అనే శబ్దం గుణ విశేషణము. ఆగుణధారణ కారణంగా యోగ్యుడైన ఏ వ్యక్తినైనా ప్రజలు భగవాన్ అని పిలుస్తారు.

## ప్రపంచాన్ని చూసాను కాని దానిని పూర్తిగా ఎరుగను

పూర్ణజ్ఞానస్థితి (కేవల జ్ఞానస్థితి) పొందటానికి నాలుగు డిగ్రీలు మాత్రమే తక్కువలో ఉంటాడు జ్ఞాని పురుషుడు. నేను స్వస్వరూపానుభూతి దశను దాటి వెళ్లాను, కానీ

యింకా పూర్ణముక్త స్థితిని లేదా కేవల జ్ఞానస్థితియైన పరమాత్మ దశను చేరలేదు.

ప్రశ్నకర్త : ఏ నాలుగు డిగ్రీల గురించి మీరు మాట్లాడుతున్నారు?

దాదాశ్రీ : ఆ నాలుగు డిగ్రీలు నా యొక్క బాహ్య మరియు ప్రాపంచిక వర్తనకు సంబంధించినవి. నేను ఈ ప్రపంచాన్ని ప్రస్తుతం అవగతం చేసుకొన్నప్పటికీ, దానిని పూర్తిగా విస్పష్టంగా తెలుసుకోలేదు. కేవళ్‌జ్ఞాన్ అనగా ప్రపంచాన్ని ఉన్నదానిని ఉన్నట్లుగా తెలుసుకోవటం. నేను దానిని అవగతం చేసుకొన్నాను. కాని పూర్తి స్పష్టతతో తెలుసుకోలేదు.

ప్రశ్నకర్త : అవగతం చేసికోవటం మరియు తెలుసుకోవటం వీటికి గల భేదం ఏమిటి?

దాదాశ్రీ : నేను పూర్తిగా అర్ధంచేసికొన్నాను కాని పూర్తిగా అనుభవపూర్వకంగా తెలిసికోలేదు. నేను దానిని పూర్తిగా తెలిసికొని ఉన్నట్లయితే దానిని "కేవళ్ జ్ఞాన్"గా పేర్కొంటారు. నేను పూర్తిగా అర్ధం చేసుకొన్నాను గనుక ఇది "కేవళ్ దర్శన్"గా పేర్కొనబడుతుంది.

## ఇక్కడ ప్రకటితమైనది చతుర్దశభువనాలకు ప్రభువు

ప్రశ్నకర్త : మీరు 'దాదా భగవాన్' అనే శబ్దాన్ని ఎవరిని ఉద్దేశించి ప్రయోగిస్తున్నారు?

దాదాశ్రీ : ఆ శబ్దము దాదాభగవాన్‌ని ఉద్దేశించినది, నన్ను కాదు. నేను జ్ఞానిపురుషుడను.

ప్రశ్నకర్త : ఏ భగవాన్ ?

దాదాశ్రీ : నాలో అభివ్యక్తమైనది ఎవరో అతడే దాదాభగవాన్. అతడు చతుర్దశ భువనాలకు ప్రభువు. అతడు మీలో కూడ ఉన్నాడు. కానీ అతడు మీలో ఇంకా అభివ్యక్తం కాలేదు. ఇక్కడ నాలో అతడు పూర్ణంగా అభివ్యక్తమైనాడు. ఈ అభివ్యక్త పరమాత్మయే ఆధ్యాత్మిక ఫలితాలనివ్వగలడు. అతని పేరును కేవలం ఒకసారి ఉచ్ఛరించిన మాత్రముననే మీకు లాభం చేకూరుతుంది. సరైన అవగాహనతో అతని నామాన్ని మీరు చెప్పినపుడు మీకు అధిక మేలు జరుగుతుంది. ప్రాపంచిక విఘ్నములు లేక

కష్టములు తొలగించబడతాయి. ఐహిక విషయాలలో మీకు అత్యాశ పనికిరాదు, ఎందువల్లనంటే ఆశకు అంతం లేదు. దాదా భగవాన్ అంటే ఏమిటో మీకు అర్థమైందా?

నీవు నీ కళ్ళతో చూస్తున్న వ్యక్తి దాదా భగవాన్ కాదు. నీ ఎదుట ఉన్న వ్యక్తి దాదా భగవాన్ అని నీవు తలుస్తూండవచ్చు. కానీ కాదు. నీవు చూస్తున్నది బాదరణ్ (భారతదేశం లోని ఒక గ్రామం) వాసి అయిన ఒక పటేల్‌ని. నేను ఒక జ్ఞానిపురుషుడను. దాదాభగవాన్ నాలో విరాజమానుడై యున్నాడు. మరియు సంపూర్ణంగా అభివ్యక్తమైనాడు. చతుర్దశ భువనాలకు ప్రభువు నాలో సాక్షాత్కరించినాడు. నేను అతడిని స్వయంగా దర్శించి అనుభూతి చెందాను. అందువలననే అతడు నాలో అభివ్యక్తమైనాడని పూర్తి నిశ్చయముతో చెప్తాను.

ఈ మాటలు చెప్పేదెవరు? మాట్లాడుతున్నది ఒక టేప్ రికార్డర్. దాదా భగవాన్‌కి వాక్కు లేదు. టేప్ రికార్డర్ ఆధారంగా మాట్లాడుతున్నది ఈ పటేల్. పటేల్ మరియు దాదాభగవాన్‌ల విభజన జరిగిన తర్వాత "మాట్లాడేవాడిని నేను" అని చెప్పటానికి అహంకారం ఏమాత్రం మిగిలిలేదు. ఈ టేప్‌రికార్డర్ మాట్లాడుతుంది; నేను దానికి జ్ఞాత, ద్రష్టగా ఉంటాను. మీలో కూడ మాట్లాడేది టేప్ రికార్డరే ; కానీ నువ్వు "నేను మాట్లాడుతున్నాను" అని తలుస్తావు, దానితో నీలో కృత్రిమ అహంకారం తలెత్తుతుంది. నా వరకు నేను కూడ నాలోని పరమాత్మ, దాదా భగవాన్‌కి శిరసా ప్రణమిల్లవలసి ఉన్నది. దాదా భగవాన్ మరియు నేను వేరు వేరు. మేము ఒకరితో ఒకరం స్నేహ సంబంధం కల్గి యుంటాము. నా ఈ శరీరమే దాదా భగవాన్ అని ప్రజలు తలుస్తారు. కానీ కాదు. బాదరణ్‌వాసి అయిన ఈ పటేల్ దాదా భగవాన్ ఎలా కాగలడు?

## (11) అక్రమ మార్గము కొనసాగుతుంది

## జ్ఞానుల వంశావళి కొనసాగుతుంది

నేను నా వెనుక ఒక తరము జ్ఞానులను వదలివెళతాను. నేను నా ఉత్తరాధికారిని వదలి వెళతాను. ఆ తర్వాత జ్ఞానుల లింక్ కొనసాగుతుంది. అందువల్ల మీరు సమకాలీన జ్ఞానికై వెదకండి. జ్ఞానిలేనిచో పరిష్కారం సాధ్యంకాదు.

నేను స్వయంగా నా ఆధ్యాత్మిక శక్తులను (సిద్ధులను) కొంతమందికి యివ్వనున్నాను. నా తర్వాత ఎవరో ఒకరి అవసరం మనకి లేదా? భావితరాలవారికి ఈ మార్గం యొక్క ఆవశ్యకత లేదా?

## ప్రపంచము ఎవరిని అంగీకరిస్తే వారే ఉత్తరాధికారి

ప్రశ్నకర్త : మీరు వెళ్లిపోయినప్పుడు మీ కొరకు దు:ఖించేవారు వేల సంఖ్యలో ఉంటారని, కానీ శిష్యులు ఎవరూ ఉండరని మీరు చెప్తున్నారు. దీని అర్థం ఏమిటి?

దాదాశ్రీ : నాకు శిష్యులు ఎవరూ ఉండరు. ఇక్కడ ఆధ్యాత్మిక సింహాసనం ఏమీ లేదు. ఇది సింహాసనం అయినట్లయితే వారసుల అవసరం ఉంటుంది. పుత్రపౌత్రాదులు వారసత్వానికి ప్రయత్నించవచ్చు. కాని యిక్కడ, ఎవరు ప్రపంచంచేత అంగీకరించబడతారో వారు మాత్రమే ఈ పనిని కొనసాగిస్తారు. సంపూర్ణ వినయముగలవారిని మాత్రమే ప్రపంచము అంగీకరిస్తుంది. ఎవరు ప్రపంచం యొక్క శిష్యునిగా వుంటారో వారే జయిస్తారు.

## ప్రత్యక్ష జ్ఞానుల వంశావళి

ప్రశ్నకర్త : ఇక్కడ మీవద్దకు వచ్చినవారంతా క్రమమార్గం నుంచి అక్రమమార్గానికి వచ్చినవారే. వీరిలో ప్రతి ఒక్కరు ఈ జ్ఞానాన్ని తమ స్వీయ రీతిలో అనుభూతి చెందారు. ఈ అక్రమ మార్గం యొక్క నిరుపమాన విశిష్టత ఏమంటే మేము ప్రత్యక్షజ్ఞాని పురుషుని కలుసుకొన్నాము. కొంతకాలం తర్వాత జ్ఞాని పురుషుడు లభించటం దుర్లభము నిజమేనా?

దాదాశ్రీ : అవును, నీవు చెప్పింది నిజమే.

ప్రశ్నకర్త : మీ ప్రత్యక్ష సాన్నిధ్యంలో అక్రమ మార్గాన్ని పొందినవారి సంగతి అటుంచితే, మీరు వెళ్లిపోయిన తర్వాత ఈ మార్గానికి వచ్చేవారి విషయం ఏమిటి? వారికి ఈ అవకాశం ఉండదు కదా!

దాదాశ్రీ : ఉంటుంది, తప్పక ఉంటుంది.

ప్రశ్నకర్త : ప్రతి ఒక్కరికీ ప్రత్యక్ష పురుషుని కలిసే అవకాశం ఉంటుందా?

దాదాశ్రీ : అవును, వారందరికీ ఈ అవకాశం లభిస్తుంది. ఇది కొనసాగుతుంది.

ప్రశ్నకర్త : ఇదే విధంగా ఇది కొనసాగుతుందా?

దాదాశ్రీ : ఇది కొనసాగుతుంది. నీకు అర్థమైందా?

ప్రశ్నకర్త : కానీ ఈ అక్రమ మార్గంలో ప్రత్యక్ష పురుషుని అవసరం లేదా?

దాదాశ్రీ : జ్ఞానియొక్క ప్రత్యక్ష సాన్నిధ్యం లేకుండా ఏ పనీ జరగదు.

ప్రశ్నకర్త : అవును, అతని సాన్నిధ్యం లేనిచో ఇది పని చేయలేదు.

దాదాశ్రీ : లేనిచో ఈ మార్గం మూత పడిపోతుంది. అందువల్ల మీకు ప్రత్యక్ష పురుషుడు అవసరము.

ప్రశ్నకర్త : క్రమ మార్గపు జ్ఞాని పురుషుడైన కృపాళుదేవుల (శ్రీమద్‌రాజ చంద్ర) సందేశాన్ని ప్రజలు ఎవరికి వారు తమకు తోచిన విధంగా వాఖ్యానించ యత్నిస్తున్నారు. మీ విషయంలో కూడ అలా జరిగే అవకాశం ఉంది కనుక ఈ విషయాన్ని ప్రత్యక్షంగా మీ నుంచి వినగోరుతున్నాను. అక్రమమార్గంలో ప్రతి ఒక్కరికీ ప్రత్యక్ష పురుషుడు లభిస్తారా? అని తెలిసికొనగోరుతున్నాను.

దాదాశ్రీ : కొంత కాలం వరకు ఈ అక్రమ మార్గం వృద్ధిపొందుతుంది.

ప్రశ్నకర్త : కొద్ది కాలమేనా?

దాదాశ్రీ : అవును, కొంత కాలము వరకే, ఎందుకంటే ఒక ప్రజా సముహము ఈ మార్గముద్వారా శుద్ధిగావింపబడి బయటకు పోవలసి ఉన్నది. ఒకసారి ఇది జరిగితే ఇంక అర్హులైన ప్రజలెవరూ మిగిలి ఉండరు, అందువల్ల ఈ అక్రమమార్గము ముగిసిపోతుంది. ఈ మార్గము ఎంచబడిన కొద్దిమంది (Choosen few) కొరకు మాత్రమే.

ప్రశ్నకర్త : అవును. ఈ కొద్దిమంది కొరకు మాత్రమే, అందువల్లనే మీరు దీనిని అక్రమమార్గం అన్నారు.

# (12) ఆత్మానుభూతి పొందిన తరువాత ఆత్మానుభవ చిహ్నాలు

ఈ జ్ఞానాన్ని పొందుటకు ముందు నువ్వు చందులాల్‌గా ఉండే వాడివి, జ్ఞానం తర్వాత నువ్వు శుద్ధాత్మగా మారావు. ఏదైనా భేదం నీకు అనుభవమయ్యిందా?

ప్రశ్నకర్త : అవును.

దాదాశ్రీ : ఈ అనుభూతి నీకు ఉదయం నిద్రలేచిన క్షణం నుంచీ కలుగుతుందా? లేక మధ్యాహ్నమా?

ప్రశ్నకర్త : ఇంతకు పూర్వపు ఏ అనుభూతి కంటే కూడ ఇది భిన్నమైనది. నేను నిద్రలేచేసరికే అది తనంతట తానుగా హాజరవుతుంది.

దాదాశ్రీ : అర్ధరాత్రి నీవు నిద్ర నుంచి మేల్కొన్నప్పుడు నీకు మొదట గుర్తు వచ్చేది ఏది?

ప్రశ్నకర్త : శుద్ధాత్మ.

దాదాశ్రీ : అవును. అర్ధరాత్రిలో మేల్కొన్నప్పుడు శుద్ధాత్మ అప్రయత్నంగా నీకు గుర్తు వచ్చినచో, అది నీవు ఆత్మను గుర్తించిన దానికి ఋజువు. ఇక నీవు జ్ఞాని పురుషుని ఆజ్ఞలను పాటించవలసి వున్నది. ఈ ఆజ్ఞలు చాలా ముఖ్యమైనవి.

నేను మీకు ఈ జ్ఞానం యిచ్చిన తర్వాత, మీలోని ఆత్మ జాగృతమౌతుంది. అపుడు నీవు పురుషుడవు (ఆత్మానుభూతి పొందినవాడివి) అవుతావు. నిన్ను శుద్ధాత్మగా గుర్తిస్తావు. నీపాపాలను నేను భస్మీభూతం చేస్తాను. నేను నీకు దివ్యదృష్టిని (దివ్యచక్షువుని) ప్రసాదిస్తాను, తత్ఫలితంగా నీవు అందరిలోనూ శుద్ధాత్మను చూడగలవు. నీకు రైట్ బిలీఫ్‌ను యిచ్చి నీ ఆత్మతో నిన్ను ఏకం చేసిన తర్వాత నేను నీకు ఐదు ఆజ్ఞలు (ప్రధాన నియమములు) యిస్తాను. ఈ ఆజ్ఞలు నీకు మార్గదర్శనం చేసి, రక్షిస్తాయి.

## శాశ్వత ఆత్మానుభూతి

దాదాశ్రీ : 'నేను శుద్ధాత్మ' అనే ఎరుకలో నీవెంతసేపు వుంటున్నావు?

ప్రశ్నకర్త : నేను ఒంటరిగా, ప్రశాంతంగా, ఏకాంత ప్రదేశంలో కూర్చున్నపుడు.

దాదాశ్రీ : వేరే సమయాలలో నీ అనుభూతి ఏమిటి ? ఏ సమయంలో నైనా 'నేను చందులాల్' అనే భావన కలుగుతుందా? నీకు నిజంగా ఎపుడైనా "నేను చందులాల్"ని అనే తలంపు కలుగుతుందా?

ప్రశ్నకర్త : జ్ఞానం తీసికొన్న తర్వాత అది జరగలేదు.

దాదాశ్రీ : అయితే నీవు కేవలం శుద్ధాత్మవి. ఒకరు ఒకే అభిప్రాయాన్ని కల్గి ఉండగలరు. దైనందిన జీవితంలో కొంతమంది తమ పేర్లను కూడ మర్చిపోతుంటారు. దానివల్ల ఏ సమస్యాలేదు. నీ శుద్ధాత్మదశ ఖచ్చితంగా నిల్చి వుంటుంది.

ప్రశ్నకర్త : కాని దైనందిన జీవితంలో చాలాసార్లు శుద్ధాత్మ ఎరుక ఉండటం లేదు.

దాదాశ్రీ : అపుడు దాని స్థానంలో 'నేను చందుభాయ్ ని' అనే ఎరుక చోటు చేసికొంటున్నదా? మూడు గంటలపాటు నీకు నువ్వు శుద్ధాత్మ అనే జాగృతి లేకపోతే, అపుడొక వేళ నేను నిన్ను "నువ్వు చందూభాయ్‌వా? శుద్ధాత్మవా?" అని అడిగితే నీవేమి చెప్తావు?

ప్రశ్నకర్త : శుద్ధాత్మ.

దాదాశ్రీ : అలా అయితే శుద్ధాత్మ జాగృతి ఎల్లవేళలా ఉన్నదనే అర్థం. ఒక మనిషి మద్యం త్రాగి ఆ సమయంలో తన ఎరుకను కోల్పోయాడనుకో. ఆమద్యం మత్తు దిగిపోయాక ఏమి జరుగుతుంది?

ప్రశ్నకర్త : అతడు మరల తనను తాను గుర్తిస్తాడు.

దాదాశ్రీ : బాహ్య పరిస్థితులు నిన్ను కూడ ఈ విధంగానే ప్రభావితం చేస్తాయి.

## ఇది దృఢ నిశ్చయంతో చెప్పబడింది.

నేను నిన్ను "నువ్వు నిజంగా చందుభాయ్‌వా లేక శుద్ధాత్మవా" అని అడిగితే "శుద్ధాత్మ" అని నువ్వు సమాధానం చెప్తావు. మరుసటి రోజు మరల నేను అదే ప్రశ్నవేస్తే నీవు మరల "శుద్ధాత్మ" అని చెప్తావు. ఇదే విధంగా నేను నిన్ను ఐదురోజులు ప్రశ్నించినచో అదే సమాధానం లభించినచో నీవు ఆత్మను పొందినట్లుగా నాకు తెలుస్తుంది. మీ మోక్షానికి తాళం చెవి నావద్ద ఉంది. మీరు ఫిర్యాదు చేసినా, అసమ్మతి తెలిపినా నేను వినను.

## శాస్త్రజ్ఞానము - అనుభవ జ్ఞానము

మీరు పొందిన జ్ఞానంలో సమస్త శాస్త్రాలసారము యిమిడి వున్నది. వేదాలలో, శాస్త్రాలలో ఏమి చెప్పబడిందో అది సత్యమే. అక్రమ విజ్ఞానం అన్ని శాస్త్రాలకంటె ఉన్నతమైనది మరియు వాటికి అతీతమైనది. శాస్త్రాలు ఆత్మను వర్ణించాయి. కాని దాని గుణాలను, లక్షణాలను పేర్కొనలేదు. నేను ఆత్మయొక్క పూర్తి వివరణ యిచ్చినందువల్ల మీరు మాత్రమే ఆత్మను పొందగలిగారు. క్రమ మార్గంలో మీరు పొందే అనుకూల గుణాలు ఏమైనప్పటికీ ఆత్మ సంబంధమైన సహస్రాంశాన్ని మాత్రమే మీరు పొందితే పొందవచ్చు. మీరు పొందేది ఏదైనప్పటికీ అది తనంతతానుగా కలిగే ఆత్మయొక్క జాగృతి మాత్రం కాదు. క్రమమార్గంలో ఆ జాగృతిని తనకు తానుగా గుర్తుచేసుకోవాలి. కాని అక్రమమార్గంలో జాగృతి దానంతట అదే సహజంగా వుంటుంది. నీవు మధ్యరాత్రిలో నిద్రమేల్కొంచినపుడు కూడ ఈ జాగృతి వుంటుంది. అనాత్మ విభాగంలోకి వచ్చే వాటిని గుర్తుపెట్టుకొనే ప్రయత్నం మాత్రమే నీవు చేయాల్సి వుంటుంది. ఆత్మను గుర్గుపెట్టుకోవలసిన అవసరం లేదు. ఒకసారి నీ నిజ స్వరూపము ఆత్మగా గుర్తించబడిన తర్వాత దానిని గుర్తుపెట్టుకొనుటకు నీవు ఏ ప్రయత్నమూ చేయనవసరం లేదు.

## తాత్కాలిక ప్రభుత్వ స్థాపన

జ్ఞానం తర్వాత, శుద్ధాత్మ స్థితి లభిస్తుంది. కానీ పరమాత్మస్థితి (పూర్ణానుభూత స్థితి) ఇంకా పొందబడలేదు. ఇపుడు సంపాదించినది తాత్కాలికస్థితి, సాక్షికమైన ఆత్మానుభూతి (అంతరాత్మ).

ప్రశ్నకర్త : పాక్షిక ఆత్మానుభవదశ అంటే ఏమిటి?

దాదాశ్రీ : ఆత్మయొక్క తాత్కాలిక దశ అయిన ఈ అంతరాత్మ రెండు పాత్రలను నిర్వహిస్తుంది. ఒకటి ప్రాపంచిక వ్యవహారాలను పూర్తి చేయటం మరియు రెండవది అంతిమమోక్షాన్ని పొందటం అనగా మీ ఫైల్స్‌ని సమభావంతో నిర్వహించటం మరియు శుద్ధాత్మపై ధ్యానం చేయటం. (జ్ఞానప్రాప్తి తర్వాత ఒక వ్యక్తి నిర్వర్తించవలసిన ఏ పనికిగాని, అతనితో లావాదేవీలు లేక అనుబంధాలున్న ఏవ్యక్తికి గాని దాదాశ్రీ 'ఫైల్' అనే పదాన్ని వాడేవారు.) ఫైల్స్ నిర్వహణ ఒకసారి పూర్తయితే పరమాత్మ స్థితి ప్రాప్తిస్తుంది. అంతరాత్మ యొక్క కర్తవ్యం ఏమంటే ఫైల్ నెంబర్ వన్‌ని (చందులాల్‌గా వ్యవహరించబడే దేహం) మరియు ఇతర ఫైల్స్‌ను నిర్వహించటం. నువ్వు శుద్ధాత్మ మరియు చందులాల్ ఫైల్ నెంబర్ వన్ ; చందులాల్ (ఫైల్‌వన్) తన ప్రాపంచిక బాధ్యతలన్నింటినీ (ఖాతాలన్నింటినీ) సమభావంతో పూర్తి చేయాలి.

ప్రశ్నకర్త : ఇది జ్ఞానాన్ని పొందిన వారికి మాత్రమే వర్తిస్తుందా?

దాదాశ్రీ : అవును. జ్ఞానాన్ని పొందిన వారు మాత్రమే అంతరాత్మను పొందుతారు. అంతరాత్మయే తాత్కాలిక ప్రభుత్వము. ఒకసారి సమభావంతో అన్ని ఫైల్స్ నిర్వహణ పూర్తి అయితే, శాశ్వత ప్రభుత్వ స్థాపన జరుగుతుంది. శాశ్వత ప్రభుత్వం అంటే పూర్ణ పరమాత్మ.

## జ్ఞానానంతరం మాత్రమే మీరు దీనిని చెప్పగలరు

ప్రశ్నకర్త : "నేను శుద్ధాత్మ" అని మేము చెప్పినచో అది అహంకార వ్యక్తీకరణకాదా?

దాదాశ్రీ : కాదు. ఇతరులు అలా చెప్పినట్లయితే అది అహంకార వ్యక్తీకరణే అవుతుంది. శుద్ధాత్మ అనే నిశ్చయానుభూతి మీకు కల్గింది కనుక మీరు ఏది అయి వున్నారో దాని గురించి మీరు మాట్లాడటం అహంకారం కాదు.

చాలామంది "నేను శుద్ధాత్మ" అని చెప్పగలరు. అది ఎలా వుంటుందంటే ఒకవ్యక్తి తన నిద్రలో నీకు ఐదువందల డాలర్లు ఇస్తానని చెప్పినట్లు (కలవరింత) ఉంటుంది. అతనిని నీవు నమ్ముతావా? అతడు జాగ్రదవస్థలో ఉండగా చెప్తే అది వేరే విషయం.

జాగృతి లేకుండా ఏమి చెప్పినప్పటికీ అది అర్ధరహితమే. అదే విధంగా ప్రజలు ఆత్మానుభూతి పొందకుండా "నేను శుద్ధాత్మ" అని చెప్పినచో అది నిద్రలో మాట్లాడిన మాటలవంటిది. ఈ విధంగా మాట్లాడటం ద్వారా వారేమీ పొందలేరు. నిజానికి యిటువంటి మాటలు వారు తమ జీవితంలో తప్పులు చేయటానికి కారణమౌతాయి. ఆత్మానుభూతి పొందిన తర్వాత మాత్రమే ఒక వ్యక్తికి "నేను శుద్ధాత్మ" అని చెప్పే హక్కు వుంది.

ప్రశ్నకర్త : జాగృతిని పొంది వుండాలా?

దాదాశ్రీ : అవును, ఆత్మానుభూతి తర్వాత మాత్రమే "నేను శుద్ధాత్మ" అని నీవు చెప్పగలవు. అపుడే అది సరైనది, ఎందువల్లనంటే నిన్ను నీవు నిజముగా తెలుసుకొన్న తర్వాత, నీవు శుద్ధాత్మగా మారిన తర్వాత నీవు ఆవిషయం చెప్తున్నావు. నువ్వు శుద్ధాత్మగా మారిన దానికి ఋజువు ఏమిటని నీవు అడిగినచో, అపుడు నేను నిన్ను "నీవెవరవు?" అని అడుగుతాను. "శుద్ధాత్మ" అని నీవు సమాధానం చెప్తావు. ఆ తర్వాత నేను నిన్ను "నీకు చందులాల్‌పై మోహం పోయిందా?" అని అడుగుతాను. నువ్వు నీకు మోహం తొలగిందని చెప్తావు. ఇదే నువ్వు శుద్ధాత్మగా మారినట్లు దృఢపరుస్తుంది.

## జ్ఞాని మీ ఎరుకను మేల్కొలుపుతాడు.

ఈ జ్ఞానానంతరం నీనిజ ఆత్మయే నీగృహమని, దానికి బాహ్యామైనదంతా పరాయిది అని నువ్వు గుర్తిస్తావు. దాని అర్ధం నీ పని పూర్తి అయినట్లే. ఇది, నిద్రపోతున్న వ్యక్తి తనను ఎవరో మేల్కొల్పగా అపాయముల నెదుర్కొనుటకు సిద్ధముగా మేల్కొని యుండుట వంటిది. అతను తన నిజనామానికి బదులు పలుకుతాడు.

ఒకసారి నీ నిజమైన గుర్తింపు శుద్ధాత్మగా తెలియబడిన తర్వాత నువ్వు మేలుకొని ఉంటావు. కాని ఎంతకాలం వరకు "నేను చందులాల్" అనే నమ్మకం నీకు ఉంటుందో, అంతకాలం నువ్వు నిద్రపోయినవాడిగానే పరిగణింపబడతావు. ఒక జ్ఞాని మాత్రమే ఈ భ్రమను నాశనం చేసి, నువ్వు శుద్ధాత్మవనే సరియైన నమ్మకానికి నిన్ను మేల్కొలపగలడు. ఒకసారి ఈజ్ఞానం నీలో స్థిరపడిన తర్వాత నీవు చందులాల్ నుంచి శాశ్వతంగా వేరుగా వుంటావు.

## అపూర్వమైన జాగ్రదానుభూతి

శ్రీమద్ రాజచంద్రగారు దీని గురించి ఇలా సూచించారు. "సద్గురువు యొక్క ఉపదేశం వల్ల అపూర్వమైన జాగృతి కలిగింది. ఆత్మపదం ఆత్మలో లభించింది. అజ్ఞానం శాశ్వతంగా పోయింది."

జ్ఞానానికి పూర్వము దేహాన్ని గురించిన ఎరుక (దేహాధ్యాస) మాత్రమే వ్యక్తికి వుండేది. ఇంతకు ముందు చందూలాల్‌గా నటించినవాడు ఇపుడు శుద్ధాత్మ స్థితికి తిరిగి వచ్చాడు. ఏది నిజనివాసస్థలమో అది నిజనివాసస్థలంగా మారింది. "నేను చందూలాల్" అనే అసత్య నివాసస్థానం పోయింది.

## నిర్వికల్పస్థితి

ఈ జ్ఞానానంతరం "నేను చందులాల్" అని ప్రపంచ విషయాలలో గుర్తింపుకోసం మాత్రమే ఉపయోగించబడుతుంది. "నేను శుద్ధాత్మ" మరియు 'ఇదినాది' అనేవి రెండూ వాటి సరియైన మరియు వేర్వేరు స్థానాలలో ఉంటాయి. జ్ఞానానంతరం వికల్పము ("నేను చందులాల్") మరియు సంకల్పము ("ఇది నాది") ఏ మాత్రమూ వుండవు. ఇది నిర్వికల్పస్థితి. ('నేను' రాంగ్ ప్లేస్‌లో ఉండటం వల్ల కలిగిన భ్రమ తొలగటమే నిర్వికల్పస్థితి.) సంకల్ప వికల్పములు తొలగిన తర్వాత మాత్రమే నిర్వికల్పస్థితి లభిస్తుంది. మొదట్లో నిర్వికల్ప సమాధియొక్క ఒక రుచి నీకు అనుభూతమై, కాలక్రమేణ పెరుగుతుంది. కాని ప్రారంభంలో జ్ఞానం నీకు స్థిరంగా వుండదు. కారణమేమంటే అనేక జన్మలుగా నీవు ఈ సహజ స్థితిని అనుభవించలేదు.

ఆత్మానుభూతిని పొందటం తేలికకాదు. ఒకరు "నేను శుద్ధాత్మ, నేను శుద్ధాత్మ ...." అని మరల మరల చెప్తుండవచ్చు కాని అనుభవం మాత్రం కల్గదు. శుద్ధాత్మయొక్క అనుభూతిని పొందుటకు జ్ఞానము మరియు జ్ఞానియొక్క అనుగ్రహము అవసరము. ఇవి కాక వేరే ఏ మార్గమూ లేదు. జ్ఞానప్రాప్తి ప్రతీతికి (దృఢ విశ్వాసము), లక్ష్యమునకు (జాగృతి) మరియు అనుభవమునకు దారి తీస్తుంది. పైగా ప్రతీతి ఎన్నడూ వదలిపోదు.

# అనుభవము, జాగృతి మరియు ప్రతీతి

ప్రశ్నకర్త : ప్రతీతి అనగా నేమి?

దాదాశ్రీ : 'నేను ఆత్మను' అని ఒకరిలో బాగా లోతుగా పాతుకొనిపోయిన దృఢమైన నమ్మకము. ప్రారంభంలో ఈ దృఢ విశ్వాసం మాటల మాధ్యమం ద్వారా పట్టుబడుతుంది. క్రమంగా 'నేను ఆత్మ' అని అనుభూతి కల్గుతుంది. "నేను చందులాల్" అనే నీ పూర్వపు దృఢవిశ్వాసం ఇపుడు చెదరగొట్టబడి శుద్ధాత్మ జాగృతితోపాటు నీవు శుద్ధాత్మవనే పూర్ణ దృఢనిశ్చయం నెలకొల్పబడింది.

ఒకసారి నీవు శుద్ధాత్మవైనచో నీకు మోక్షానికి గ్యారంటీ లభించినట్లే. ఈ విషయంలో ఏ సందేహానికీ తావులేదు. శుద్ధాత్మస్థితిని నీవు ఎంతగా అనుభవిస్తున్నావు? ప్రాథమిక దశలో ఇది ప్రతీతి నుండి కల్గుతుంది. నీవు రాత్రివేళ మేల్కొంచితే వెంటనే నీకు నువ్వు శుద్ధాత్మవనే జాగృతి కలుగుతుంది. నీకు 100% శుద్ధాత్మ దృఢ నిశ్చయం వున్నదని, జాగృతి కూడ స్థాపించబడిందని దీని అర్థం. జాగృతి (లక్ష్యం) అనగా ఆధ్యాత్మికంగా మేల్కొని యుండుట. పూర్ణస్థితిని చేరేవరకు ఈ జాగృతి వృద్ధిపొందుతూ ఉంటుంది. నీవు అనుభూతి చెందటం మూడవది. శుద్ధాత్మానుభూతి కారణంగానే నీవు ప్రతిరోజూ సత్సంగానికి హాజరవుతున్నావు (సత్=పూర్ణసత్యం, సంగం=కలయిక); నీవు ఏదోరుచి చూశావు మరియు దానిలోని మాధుర్యాన్ని కనుగొన్నావు.

ఇక మీదట నీ నిజ స్వరూపం (ఆత్మ) యొక్క అనుభూతి, జాగృతి మరియు దృఢవిశ్వాసం నీకు కలుగుతుంది. దానికై పట్టే సమయంలో మనిషి మనిషికి కొంత వ్యత్యాసం వుండవచ్చు. అనుభవం మరియు జాగృతి వీటిలో హెచ్చుతగ్గులుంటాయి. శుద్ధాత్మస్థితి యొక్క దృఢ నిశ్చయం(ప్రతీతి) మాత్రం స్థిరంగా వుంటుంది. ప్రతీతి స్థిరంగా వుంటే ఆ స్థితిని 'క్షాయక్ సమకిత్' (Continuous link of the right belief) అని పిలుస్తారు. ప్రతీతిలో హెచ్చు తగ్గులుంటే దానిని 'సమ్యక్ దర్శన్ లేక ఉపశమ సమకిత్' అంటారు. ఒక వ్యక్తి చేసేపని మీద ఆధారపడి, జాగృతి మార్పుకు లోనవుతుంది. ఎవరితోనైనా మాట్లాడుతున్నట్లయితే అపుడావ్యక్తికి జాగృతి వుండదు. ఇక అనుభవం విషయానికొస్తే ఒంటరిగా ఉన్నపుడు ఇది కలుగుతుంది. అనంతజన్మలుగా

బహిర్ముఖమైన దేహమనోవ్యాపారాలు ప్రతీతి, అనుభవము, జాగృతి అనే మూడు స్థితుల ద్వారా ఇపుడు తిరిగి ఆత్మని చేరతాయి. లక్ష్య రహితమైన అన్ని తిరుగుళ్లనూ ముగిస్తూ అవి తమ దిశను మార్చుకొంటాయి.

ప్రశ్నకర్త : ఏ విధమైన వ్యాపారాలు (వృత్తులు)?

దాదాశ్రీ : అన్ని రకాలు. ఇవి చిత్తసంబంధమైన వృత్తులు, వస్తు సంచయ సంబంధమైన వృత్తులు, ఇంద్రియ విషయములకు సంబంధించిన కోరికలు. ఇంకా చాలా రకాల వృత్తులున్నాయి. ప్రపంచంలో తిరగటానికి అలవాటు పడిన ఈ వృత్తులు ఇపుడు తిరిగి ఆత్మను చేరతాయి. బయట సంచరించటం ఆగిపోతుంది.

## ఆత్మస్థితి పూర్తిగా పరిశుద్ధమైనది.

ఈ జ్ఞానానంతరం, ఇంతకు పూర్వం నీలో నెలకొన్న 'నేను కర్తను' అనే భ్రాంతి తొలగిపోతుంది. నీవు పూర్తిగా శుద్ధుడవు.  శుద్ధ జాగృత దశను మరువకుండుటకై ఇది 'శుద్ధాత్మ' స్థితి అని చెప్పబడింది. ఇది శుద్ధ జాగృతిని సూచిస్తుంది. నీ నిజస్వరూప శుద్ధతను ఎరుకలో ఉంచుతుంది.

ఒకవేళ 'చందులాల్' ఎవరిపైనైనా కోపగించినా, ఎవరినైనా నిందించినా, ఏమి జరిగినప్పటికీ 'నీవు' సంపూర్ణముగా శుద్ధుడవు. అయినప్పటికీ ఇటువంటి వ్యతిరేక సందర్భాలలో నీవు 'చందులాల్'కి ప్రతిక్రమణ చేయమని చెప్పాలి మరియు ఇటువంటి అతిక్రమణ ద్వారా ఇతరులకు దుఃఖాన్ని కల్గించకుండునట్లు 'చందులాల్'ని అప్రమత్తం చేయాలి.

ఇతరులు గాయపడేలా ప్రవర్తించటంగాని, మాట్లాడటం గానీ నీవు చేసినచో అది ఉద్రేకపూరితమైన చర్య. అది అతిక్రమణ కనుక దానికి ప్రతిక్రమణ చేయాలి. ప్రతిక్రమణ అనగా తన తప్పును ఒప్పుకొని ఎదుటి వ్యక్తి వద్ద పశ్చాత్తాపపూర్వకంగా క్షమను అర్థించటం. "నేను ఈ తప్పు చేశాను. నేను తప్పు చేసినట్లు ఒప్పుకొంటున్నాను. ఈ తప్పు మరల చేయకూడదని నిశ్చయించుకుంటున్నాను''  ఈ విధంగా ప్రతిజ్ఞ చేయాలి. ఒకవేళ ఇదే తప్పు నువ్వు తిరిగి చేసినట్లయితే మళ్లీ నీవు పశ్చాత్తాపం చెందాలి,

తప్పు ఒప్పుకొని క్షమాపణ కోరాలి. నీ పొరపాట్లను నీవు గుర్తించిన వెంటనే ఈ పని చేయాలి. ఈ విధంగా చేస్తుండటం వల్ల నీ తప్పులు తగ్గటం, క్రమేపి తప్పులు తొలగిపోవడం జరుగుతుంది.

ప్రశ్నకర్త : ఒక వ్యక్తి పట్ల ప్రతిక్రమణ ఏ విధంగా చేయాలి?

దాదాశ్రీ : ఏవ్యక్తిని నువ్వుగాయపరిచావో ఆ వ్యక్తి యొక్క దేహనామాలకు, మనోవాక్కాయాలకు, భావ, ద్రవ్య, నో కర్మలకు (భావరూపంలో పూర్వ సంచిత ఛార్జికర్మ, ఇపుడు క్రియారూపందాల్చిన కర్మ, పూర్తి అయిన కర్మ), అతీతమైన శుద్ధాత్మను నీవు స్మరించాలి. ఈ విధంగా ఆ వ్యక్తి యొక్క శుద్ధాత్మను గుర్తు తెచ్చుకోవాలి. అపుడు 'చందు లాల్' తన తప్పులను, పొరపాట్లను ఆలోచన (ఆత్మావలోకనం) ద్వారా గుర్తించాలి. ఆ తప్పులకు పశ్చాత్తాపం చెంది క్షమాపణకై వేడుకోవాలి, ఆ తప్పుల్ని మరల చేయనని ప్రతిజ్ఞ చేయాలి. నీవు శుద్ధాత్మవు, 'చందులాల్' ప్రతి క్రమణ ఎలా చేస్తున్నదీ, ఎంత నిజాయితీగా చేస్తున్నది నీవు గమనించాలి.

## 'నేను ఈ శరీరము' అనేది దేహాధ్యాస

సాధారణంగా ఈ ప్రపంచ జనులు 'నేను ఈ శరీరాన్ని' అనే జ్ఞానాన్ని త్యజించలేరు. వారు తమ నిజ స్వరూపాన్ని ఎరుగరు. ఏదో విధంగా నీవు ఈ జ్ఞానాన్ని పొంది ఇపుడు అహంకార రహితుడవయ్యావు. 'నేను చందులాల్' అనే భావన అహంకారం. శుద్ధాత్మజ్ఞానం నెలకొల్పబడినపుడు దేహం మీద కానీ, దానికి సంబంధించిన వాటిమీదగాని మమకారం ఉండదు. అయినప్పటికీ ప్రారంభంలో నీవు పొరపాట్లు చేయడమూ, ఒక విధమైన ఊపిరి సలుపనటువంటి అసౌకర్యాన్ని అనుభవించటమూ జరగవచ్చు.

## లోపలినుంచే ప్రజ్ఞ నిన్ను అప్రమత్తం చేస్తుంది.

ఈ జ్ఞానము విజ్ఞాన శాస్త్ర సంబంధమైనది కనుక, అది క్రమంగా వృద్ధి చెందటం నీకు అనుభూతమౌతుంది. లోపలినుండే అది తనంత తానుగా నిన్ను అప్రమత్తం చేస్తుంది. నీవు చేయవలసినది ఏమీ లేదు. కాని పరంపరానుగత ఇతర క్రమ మార్గానికి

సంబంధించిన జ్ఞానం విషయానికొస్తే అది నీ ప్రయత్నంపై ఆధారపడి ఫలితాన్నిస్తుంది.

ప్రశ్నకర్త : అవును. లోపలినుంచి ఏదో అప్రమత్తం చేస్తున్నట్లు నేను అనుభూతి చెందుతున్నాను.

దాదాశ్రీ : మనం ఇపుడీ మార్గాన్ని కనుగొన్నాం మరియు శుద్ధాత్మ రాజ్యంలో మొదటి ద్వారాన్ని దాటాము. ఇక్కడి నుంచి మనల్ని ఎవ్వరూ వెనక్కి తిప్పి పంపలేరు. లోపలినుంచి నిన్ను హెచ్చరించేదెవరు? అది ప్రజ్ఞ. ప్రజ్ఞ ఆత్మ యొక్క ప్రత్యక్ష ప్రకాశం. ఈప్రజ్ఞ జ్ఞానవిధి తర్వాత మొదలౌతుంది. సమకిత్ స్థితిలో ప్రజ్ఞ పాక్షికంగా వుంటుంది. ఇది అమావాస్య తర్వాతి రోజు కన్పించే నెలవంక చంద్రుని పోలి వుంటుంది. ఇది ప్రారంభదశ. ఇక్కడ జ్ఞానం పొందిన వీరందరికీ ప్రజ్ఞ పూర్ణచంద్రునిలా పూర్తిగా అభివ్యక్తమైంది. ప్రజ్ఞ యొక్క పూర్ణశక్తి నిన్ను శాశ్వతంగా అప్రమత్తంగా ఉంచుతుంది. నిన్ను అంతిమ మోక్షానికి చేర్చటమే దాని విధి. భరత్‌రాజు తనను హెచ్చరించటానికి, అప్రమత్తం చేయటానికి సేవకులను నియమించుకోవలసి వచ్చింది. వారు ప్రతి పదిహేను నిమిషాలకు “భరత్ రాజా! మేలుకో!” అని అరవటం ద్వారా అతనిని అప్రమత్తం చేసేవారు. నీ విషయంలో లోపలి నుంచే ప్రజ్ఞ నిన్ను సదా హెచ్చరిస్తుంటుంది. ఇదే ఆత్మానుభూతి. నిరంతర ఆత్మానుభూతి.

## అనుభవ దశలు.

ప్రశ్నకర్త : ఆత్మ యొక్క అనుభూతిని ఇంకా ఎక్కువ పొందటం కోసం ఏమైనా చేయవలసివున్నదా?

దాదాశ్రీ : శుద్ధాత్మ జాగృతి నీకు రోజంతా ఉంటున్నదా?

ప్రశ్నకర్త : అవును.

దాదాశ్రీ : మరి ఇంకా ఏ అనుభవం కావాలి? ఆ జాగృతియే శుద్ధాత్మయొక్క అనుభూతి. భారతదేశంలోని ప్రజానీకంలో ఏ ఒక్కరైనా శుద్ధాత్మజాగృతిని కల్గి ఉన్నారేమో అడిగి తెల్సుకోండి. ఈ జ్ఞానానంతరం శుద్ధాత్మానుభూతి కలుగుతుంది. మరియు దినదినాభివృద్ధి చెందుతుంది.

ప్రపంచాన్ని ఆత్మరూపంగా దర్శించగలగటమే ఆత్మానుభూతి. నిన్ను నీవు శుద్ధాత్మగా అనుభూతి చెందావు. ఆ నిజ దర్శనం పూర్తయింది. ఇకమీదట ఈ అనుభూతి క్రమంగా నీవు కేవలజ్ఞాన్ దశను (పూర్ణస్థితి) చేరే వరకు వృద్ధి చెందుతుంది. కేవళ్ జ్ఞానస్థితియే పూర్ణస్థితి, పూర్ణానుభూతి. ప్రస్తుతం నీ అనుభవం పాక్షికం మాత్రమే.

## అనుభవం నిలిచి వుంటుంది.

మీరు ఈ జ్ఞానాన్ని పొందిన క్షణం నుంచీ అనుభవం మిమ్మల్ని వదిలిపోదు. ఇది ఎలా జరుగుతుంది? మీకు నేను ఏ జ్ఞానానుభూతినైతే ప్రసాదించానో, అది ఎప్పటికీ మిగిలి ఉంటుంది. ఏమైనప్పటికీ మీ గతకర్మ ప్రభావము ఆ అనుభావాన్ని మేఘంలా ఆవరిస్తుంది. దానిని నేను మార్చలేను. ఆ ప్రభావాన్ని సహించవలసినదే.

ప్రశ్నకర్త : దాదాజీ! ఇక మీదట మేము దానిని బాధగా తలంచము కదూ!

దాదాశ్రీ : అది వేరే విషయం. కాని మిగిలియున్న ఖాతాలున్నాయి కదా! కొంతమందికి ఎక్కువ ఖాతాలు, మరికొంతమందికి తక్కువ ఖాతాలు. కొంతమంది ఎక్కువ బాధలు అనుభవించవలసి వుండవచ్చు. అదేమంత పెద్దవిషయం కాదు. నేను నిన్ను శుద్ధాత్మ స్థితికి లేవనెత్తాను. మీ పూర్వపు కర్మలఫలంవల్ల మీరు తేలికపాటి బాధలను అనుభవించవలసి వస్తే రావచ్చు. కానీ అవి మీకు ఊపిరి సలపనంతటి తీవ్రబాధ కల్గించవు.

## ఆత్మానుభూతి - దేహానుభూతి

మానసిక, శారీరక సమస్యలు లేదా బాహ్య సమస్యలు మిమ్మల్ని బాధించని సమయంలో మీ జ్ఞానం నిజమైనదని మీకు తెలుస్తుంది. ఎక్కువ ధనం గల డబ్బు సంచిని నీవు పోగొట్టుకొన్నచో మానసికమైన అశాంతిని అనుభవిస్తావు. ఆ సమయంలో నీకు నీవు "ఇది వ్యవస్థిత్" అని లోలోన చెప్పుకొన్నట్లయితే నీవు 'చందులాల్'ని (ఫైల్ నెంబర్ వన్‌ని) సమాధానపరచగలవు. ఈ ఆంతరంగిక అనుభూతియే ఆత్మానుభూతి. అట్లు చేయనిచో "చందూలాల్" ప్రశాంతంగా ఉండలేక మనశ్శాంతిని కోల్పోతాడు. అపుడు అది దేహానుభూతి (దేహాధ్యాస). ఈ రెండూ నీకు అనుభవమేనా?

ప్రశ్నకర్త : అవునుదాదా! ఆత్మానందం లభిస్తుంది. అదే నా అనుభూతి.

## ఇంకా ఏమి మిగిలివుంటుంది?

ఇంకొక మార్గం క్రమమార్గం. ఇది అక్రమ విజ్ఞానం. ఇది వీతరాగపురుషుల, పూర్ణప్రకాశస్వరూపుల, సంపూర్ణజ్ఞానుల యొక్క జ్ఞానము. ఈ రెండు మార్గాల జ్ఞానంలో భేదం లేదు.

ఈ జ్ఞానానంతరం నీవు ఆత్మానుభూతిని పొందుతావు. నీవు చేయటానికి ఇంకా ఏముంది? నీవు చేయవలసిందల్లా జ్ఞాని పురుషుని ఆజ్ఞలను పాటించటమే. ఈ ఆజ్ఞలే నీకు ధర్మము, ఆజ్ఞలే నీకు తపస్సు. నా ఆజ్ఞలు ప్రాపంచిక వ్యవహారాలలో నీకు ఎటువంటి నిర్బంధాలనూ కల్గించవు. నీవు సంసారంలో కొనసాగినప్పటికీ సంసార జీవితం నిన్ను ప్రభావితం చేయదు. అక్రమ విజ్ఞానం యొక్క మాహాత్మ్యం అంత గొప్పది.

ఈ అసాధారణ విజ్ఞానం ఎంత ఆశ్చర్యకరం అంటే అది లోపలినుంచే నీ నిజ స్వరూపంలో నీవు స్థిరపడేలా నిన్ను సదా అప్రమత్తం చేస్తుంది. ఎవరైనా వ్యతిరేక చర్యలకు పాల్పడినప్పటికీ ఆ వ్యక్తి వెంటనే లోపలి నుండే హెచ్చరింపబడతాడు. అందువల్ల నీవు ఏమీ చేయవలసిన అవసరం లేదు. ఈ విజ్ఞానశాస్త్ర జ్ఞానమే అన్ని బాధ్యతలను స్వీకరిస్తుంది. నీవు చేయవలసినదల్లా ఇప్పటినుంచి దాదాశ్రీ ఆజ్ఞలను పాటించాలని దృఢంగా నిశ్చయించుకోవడమే. ఈ ఆజ్ఞలు నిన్ను అన్ని రకాల ప్రభావాలనుంచి రక్షిస్తాయి. నిద్రలో కూడ నీకు హెచ్చరికలు వస్తాయి. ఇంతకంటే ఎక్కువ నీకేమి కావాలి?

ఇంకొక్క జన్మలో నీవు ముక్తి పొందదల్చుకొంటే నా ఆజ్ఞలను పాటించు.

## ఆజ్ఞయే ధర్మము.

ముక్తి పొందదల్చుకొన్నవారికి కర్మల ఆవశ్యకతలేదు. ముముక్షువులైన వారికి కావలసినది జ్ఞానము మరియు జ్ఞానియొక్క ఆజ్ఞలు మాత్రమే. మోక్ష కాంక్షలేనివారికి, ప్రాపంచిక సంతోషాలను కోరుకునేవారికి కర్తవ్యం అవసరము.

ఈ మోక్ష మార్గంలో ఏ విధమైన తపస్సు లేక త్యాగము యొక్క ఆవశ్యకత లేదు. జ్ఞానిని కలవటం ఒక్కటి మాత్రమే అవసరము. అపుడు జ్ఞానినుంచి పొందిన ఆజ్ఞలే నీధర్మము మరియు తపస్సు అవుతుంది. జ్ఞానము (యదార్ధ జ్ఞానము),

దర్శనము (యదార్ధ దర్శనము), చారిత్ర్ (సత్ప్రవర్తనము) మరియు తపము అనేవి మోక్షానికి నాలుగు స్తంభాలు. ఆజ్ఞాపాలనకి ప్రత్యక్ష ఫలము స్వేచ్ఛ, ఎందుకనగా ఈ నాల్గుస్తంభాలు వాటిలో ఇమిడి వున్నాయి.

## జ్ఞాని వద్ద ఉండు

ఇంతకు ముందెన్నడూ జ్ఞానిపట్ల ప్రేమ కలుగలేదు. ఒకసారి ఈ ప్రేమ భావం ఉత్పన్నమైతే అన్నింటికీ పరిష్కారం లభిస్తుంది. గత జన్మలలో నీభార్యా బిడ్డల పట్ల ప్రేమ వల్ల నీవు పొందినది ఏమీలేదు. ఒకసారి జ్ఞానిపురుషుని నుండి జ్ఞానాన్ని పొందిన తర్వాత ఆవ్యక్తి జ్ఞానివద్దనే ఉండాలనేది భగవంతుని ఉవాచ.

ప్రశ్నకర్త : ఏ విధంగా మేము జ్ఞానితో ఉండాలి?

దాదాశ్రీ : ఈ జ్ఞానం లభించిన తర్వాత మీకు జ్ఞాని వైపు తప్ప వేరే ఏ దిశలోనూ ఆరాధన ఉండదు. ఇది అక్రమ విజ్ఞానమని మాకు తెలుసు. ప్రజలు తమతో అసంఖ్యాకమైన ఫైల్స్‌ను తెచ్చుకొన్నారు కనుక వారు వెళ్లి తమ ఫైల్స్ వ్యవహారాలను నిర్వహించుకోవటానికి నేను వారికి స్వేచ్ఛనిచ్చాను. నేను మిమ్మల్ని పూర్తిగా వెళ్ళిపోనివ్వటం లేదు. మీరు సమభావంతో మీ ఫైల్స్‌ను నిర్వహించుకోవటం కోసమే నేను మిమ్మల్ని వెళ్ళనిస్తున్నాను. లేదంటే మీరు జ్ఞానివద్ద ఉండిపోవటమే మంచిది.

అంతేకాక, జ్ఞాని సాన్నిధ్యంలో ఉండే అవకాశాన్ని, సత్సంగంద్వారా జ్ఞానాలాభాన్ని పూర్తిగా పొందే అవకాశాన్ని కోల్పోయినందుకు మీలో మీరు పగలు రాత్రి బాధపడ్తుంటారు. జ్ఞానితో ఉండే అవకాశాన్ని పెంచుకోవాలన్న ఒక్క కోరిక మాత్రమే మీకు ఉండాలి. మీ ఫైల్స్ (సంసార బాధ్యతలు) తగ్గిపోవాలని, తద్వారా మీరు స్వేచ్ఛగా జ్ఞాని సాన్నిధ్యంలో ఉండాలని మీకు అంతరంగంలో కోరిక ఉండాలి.

అటువంటి వ్యక్తికోసం మహావిదేహ క్షేత్రం ఎదురు చూస్తుంది.ఎవరిలో శుద్ధాత్మ జాగృతి స్థాపించబడిందో వారు భరతక్షేత్రంలో (ప్రపంచంలో) ఉండలేరు. ఎవరి ఆత్మ జాగృతమౌతుందో వారు మహా విదేహ క్షేత్రానికి చేరతారు, ఇది నియమం. వారు ఈ దోష భూయిష్టమైన ప్రస్తుత కలికాలంలో ఉండజాలరు.ఇంకా ఒకటి లేక రెండు

జన్మలలో మహా విదేహ క్షేత్రంలో తీర్ధంకరులైన శ్రీ సిమంధరస్వామి దర్శన భాగ్యాన్ని పొందిన తరువాత వారు మోక్షాన్ని పొందుతారు. ఇదే ఈ మార్గం యొక్క సరళత మరియు సులభత్వం. నా ఆజ్ఞలలో ఉండాలి. ఆజ్ఞలే ధర్మము మరియు ఆజ్ఞలే తపము. సమభావంతో మీరు మీ ఫైల్స్ అన్నింటినీ పూర్తి చేసుకోవాలి. ఎంతగా ఆజ్ఞలను పాటించగలిగితే అంత ఎక్కువగా పాటించండి. ఆజ్ఞలను స్థిరంగా పూర్ణరూపంలో పాటించగలిగితే భగవాన్ మహావీర్ స్థితిని మీరు పొందవచ్చు. మీరు అనాత్మను మరియు ఆత్మను చూస్తూపొండి. అపుడు మీ చిత్తం అటూయిటూ పరుగులెత్తదు. కాని ఆసమయంలో మనసులో కొత్త ఆలోచనలు తలెత్తితే కొత్త ప్రశ్నల సృష్టి జరుగుతుంది.

ఈ జ్ఞానానంతరం మీరు ఐదు ఆజ్ఞలను పాటించినచో భగవాన్ మహావీర్ పొందిన బ్రహ్మానందాన్ని పొందుతారు. నేను సదా అదే ఆనందంలో ఉంటాను. నేను ఏ మార్గాన్ని అనుసరించానో అదే ఆనందంలో ఉంటాను. నేను ఏ మార్గాన్ని అనుసరించానో అదే మీకు చూపిస్తున్నాను. నిజమైన రాజ్యంలో (ఆత్మ స్వరూప స్థితిలో) మీ ఆధ్యాత్మిక జాగృతి, నా ఆధ్యాత్మిక జాగృతి ఒక్కటే.

## (13) ఐదు ఆజ్ఞల ప్రాముఖ్యత

## జ్ఞానానంతరం ఆధ్యాత్మిక సాధన

ప్రశ్నకర్త : ఈ జ్ఞానానంతరం ఎటువంటి ఆధ్యాత్మిక సాధన చేయవలసి వుంటుంది?

దాదాశ్రీ : ఈ ఐదు ఆజ్ఞలను పాటించటమే ఏకైక సాధన. వేరే ఏ సాధనా లేదు. మిగిలిన సాధనలన్నీ బంధ హేతువులు. ఈ ఐదు ఆజ్ఞలు మిమ్మ బంధవిముక్తుల్ని చేస్తాయి.

## ఆజ్ఞలవల్ల పరమానందం

ప్రశ్నకర్త : మీ ఐదు ఆజ్ఞలకంటే శ్రేష్ఠమైనది ఏమైన ఉన్నదా?

దాదాశ్రీ : ఈ ఐదు ఆజ్ఞలు మీ అమూల్యనిధిని కంచెలా రక్షిస్తాయి. ఈ కంచెను మీరు పూర్తిగా మూసి వుంచినట్లయితే, నేను మీకు ప్రసాదించిన అమూల్యనిధిని ఎవరూ అపహరించలేరు. ఈ ఐదు ఆజ్ఞలు అనే కంచె బలహీనపడితే ఎవరో ఒకరు

లోన ప్రవేశించి వస్తువులను పాడుచేసే అవకాశం ఉంది. అపుడు నేనువచ్చి ఆకంచెను మరమ్మత్తు చేయాల్సి వస్తుంది. అందువల్ల మీరీ ఐదు ఆజ్ఞలలో ఉన్నట్లయితే మీ శాశ్వతానందానికి నేను గ్యారంటీ యిస్తాను.

ఈ ఐదు ఆజ్ఞలు మీ రక్షణ కోసం యివ్వబడినవి. నేను మీకు జ్ఞానం యిచ్చాను. మరియు భేదజ్ఞానం ద్వారా మిమ్మల్ని వేరు చేశాను. మీరు (అనాత్మనుంచి) ఇలాగే వేరుగా కొనసాగటం కోసమూ, ఇంకా ఎక్కువ రక్షణకోసమూ మీకు ఈ ఐదు ఆజ్ఞలను ఇచ్చాను. ఈ కలికాలంలో (వంచన, చీకటికాలం) రక్షణలేకుంటే ఈ అమూల్యజ్ఞాననిధిని ఎవరైనా దోచుకోవచ్చు. జ్ఞానబీజం మహావృక్షంగా వృద్ధి పొందాలంటే దానికి నీళ్ళు పోసి, పోషణ చెయ్యాలి. ఆ చిన్ని మొలకకు రక్షణగా చిన్న కంచెను ఏర్పాటు చెయ్యాలి.

## ఐదు ఆజ్ఞలు పరమాత్మదశకు దారితీస్తాయి.

దాదాశ్రీ : ఈ ఐదు ఆజ్ఞలు చాలా సరళమైనవి. అవునా?

ప్రశ్నకర్త : కానీ దైనందిన అనుభవంలో అవి కష్టంగా అన్పిస్తాయి.

దాదాశ్రీ : అవి కష్టమైనవి కాదు. అధికమైన మీ పూర్వజన్మసంచిత కర్మ డిశ్చార్జి అవుతుండటం (వెలికి వస్తుండటం) వల్ల అవి అలా కన్పిస్తాయి. అటువంటి సమయాలలో మీరు ఎక్కువ జాగ్రత్త వహించవలసి వుంటుంది. అట్టి సందర్భాలలో ఆధ్యాత్మిక సోమరితనం కొంచెం కూడ పనికిరాదు. మీరు నా ఆజ్ఞలలో ఉన్నచో మహావీర్ భగవాన్ పొందిన సమాధి అనుభూతిని పొందగలరు. పూర్వపు మీ మానసిక వృత్తులు మిమ్మల్ని ఆజ్ఞలలో ఉండనీయవు. జ్ఞాత - జ్ఞేయము స్థితిని (యదార్ధ స్థానంలో ఉన్న 'నేను' జ్ఞాతగా లేక ద్రష్టగా మరియు ఫైల్ నెంబర్ వన్, చందూ లాల్, జ్ఞేయముగా) కాపాడుకొనటం ద్వారా, నీవు నీ మానసిక ప్రవృత్తులకు అతీతంగా వుండవచ్చు. ఈ మనో వ్యాపారాలకు చోటు యివ్వరాదు. పూర్వపు ఏ ప్రవృత్తుల పట్ల గానీ హర్షం చెందరాదు. లేకుంటే అవి వేరే విధంగా బహిర్గతమై నీ చుట్టూ నృత్యం చేయవచ్చు. నిన్ను వశీకరణం చేసుకోవచ్చు. దాని అర్థం నీవు పతనమయ్యావని కాదు. అవి ఇతర ఆందోళనలకు, కష్టాలకు హేతువు కూడ కావచ్చు. ఇదే జరిగితే నీ నిజమైన ఆనంద స్థితికి ఆవరణ ఏర్పడుతుంది. నీ శాంతికి అంతరాయం ఏర్పడితే దానికి కారణం ఈ పూర్వపు ప్రవృత్తులే.

దృఢనిశ్చయం వల్ల నీవు ఆజ్ఞలను పాటించగల్గుతావు. మనోనిశ్చయం లేనపుడే సమస్యలు చోటు చేసుకుంటాయి. 'నేను ఆజ్ఞలలో ఉండి తీరతాను' అని నీవు నిశ్చయించుకోవాలి. అలా నిశ్చయించుకోవటం సాధ్యమే, అవునా కాదా? ఇలా దినదినమూ ఏరోజుకారోజు నిశ్చయించుకోవటం సాధ్యం కానిచో, ఒకేసారి ఒకరోజు గట్టిగా నిశ్చయించుకొని ఆ ఆజ్ఞలను దృఢంగా పాటించటం వల్ల కలిగే ఆనందాన్ని ప్రతి సమయంలోనూ ఎందుకు అనుభవించకూడదు? నేను నా ఆజ్ఞలను పాటించమని చెప్పటం లేదు. నా ఆజ్ఞలను పాటించాలనే నిర్ణయాన్ని తీసుకోమని నీకు చెప్తున్నాను.

## దృఢ నిశ్చయమే ఆజ్ఞలను పాలింపజేస్తుంది.

దాదాజీ ఆజ్ఞలను పాటించాలని నిశ్చయించుకోవటమే అన్నింటికంటే గొప్ప విషయం. ఆ విధంగా మీరు నిర్ణయించుకోవాలి. ఆజ్ఞలను నేను పాటించగలనా లేదా అని మీకై మీరే ఆలోచించవద్దు. ఎంతవరకు పాటించగలిగితే అంతవరకు ఖచ్చితంగా యదార్ధంగా పాటించాలి. కనీసం వాటిని పాటించాలనే నిశ్చయాన్ని కల్గి ఉండండి.

ప్రశ్నకర్త : వాటిని పూర్తిగా పాటించలేక పోయినప్పటికీ ఏమీ యిబ్బందిలేదా?

దాదాశ్రీ : లేదు. పూర్తిగా లేదని కాదు. ఆజ్ఞలను పాటించే విషయంలో నీ నిశ్చయం దృఢంగా ఉండాలి. నీవు నిద్ర లేవగానే 'నేను ఆజ్ఞలలో ఉండాలి, ఆజ్ఞలను పాటించాలి' అని నిశ్చయించుకోవాలి. ఈ నిశ్చయం నిన్ను ఆజ్ఞలలో ఉంచుతుంది. అదే నేను కోరేది. నీవు ఆజ్ఞలను పాటించలేకపోవటానికి కారణాలు నాకు తెలుసు. ఏమైనప్పటికీ నీ నిశ్చయం అవసరం.

మా జ్ఞానం వల్ల తప్పక మోక్షం ప్రాప్తిస్తుంది. నీవు ఆజ్ఞలలో ఉన్నట్లయితే మోక్షం గ్యారంటీ. ఈ విషయంలో ఎటువంటి వివాదానికి తావు లేదు. ఎవరైనా ఆజ్ఞలను పాటించదల్చుకోనప్పటికీ వారు జ్ఞాన బీజాన్ని పొందినందువల్ల ఎపుడో ఒకప్పటికి అది పెరుగుతుంది. జ్ఞానాన్ని తీసుకొని ఆజ్ఞలను పాటించనివారి సంగతి ఏమిటని ప్రజలు నన్ను అడుగుతుంటారు. దాని గురించి ఆలోచించవలసిన పని వారిది కాదని నేను వారికి చెప్పాను. వారు నానుంచి జ్ఞానాన్ని పొందినందువల్ల ఆవిషయం నాకు సంబంధించినది. జ్ఞానాగ్నిలో వారి పాపాలు భస్మీభూతం చేయబడ్డాయి. వారు ఆజ్ఞలకు కట్టుబడి ఉన్నట్లయితే ఆనందం లభిస్తుంది.

మీరు ఆజ్ఞలను పాటించినట్లయితే పని పూర్తవుతుంది. నేను ఈ ఆజ్ఞలను సదా పాటిస్తాను. నేను ఏ స్థితిలో అయితే ఉన్నానో ఆస్థితినే మీకు ప్రసాదించాను. ఆజ్ఞలను పాటించినపుడే అది ఫలితాన్నిస్తుంది. స్వయం కృషితో ఎవరైనా దీనిని పొందాలని ప్రయత్నిస్తే ఒక వంద వేల (లక్ష) జన్మల తర్వాత కూడ విజయాన్ని పొందలేరు. ఆజ్ఞలను పాటించాలన్న భావన ఉన్నప్పటికీ, బుద్ధిమాద్యమం ద్వారా ఆజ్ఞలను పాటించినందువల్ల అది వారి ఆజ్ఞల రక్షణగోడను బలహీనపరచటానికే ఉపయోగపడిన సందర్భాలున్నాయి. అందువల్ల మీరు అప్రమత్తంగా శ్రద్ధతో ఉండవలసిన అవసరం ఉన్నది.

మీరు ఆజ్ఞలను పాటించటం మరిచినట్లయితే ప్రతిక్రమణ చేయాలి. మరపు మానవనైజం. మరిచిపోయినపుడు "దాదా! దయతో నన్ను క్షమించండి. నేను ఈ రెండు గంటలూ ఆజ్ఞలను పాటించటం మర్చిపోయాను. నేను మీ ఆజ్ఞలను పాటించగోరుతున్నాను. దయ చేసి నన్ను క్షమించండి'' అని చెప్పటం ద్వారా ప్రతిక్రమణ చేయాలి. ప్రతిక్రమణ ద్వారా, మీ బాధ్యతనుంచి మీరు విడుదల పొందుతారు.

ఒకసారి మీరు ఆజ్ఞల రక్షణ పరిధిలోనికి వచ్చినట్లయితే ప్రపంచంలో ఏదీ మిమ్మల్ని బాధించదు. కర్మ మిమ్మల్ని బంధించదు. అయితే ఆజ్ఞలను ఇచ్చినవారిని బంధిస్తుందా? లేదు, ఎందువల్లనంటే అవి పరులహితాన్ని కోరి యివ్వబడినవి కనుక.

## ఇవి భగవంతుని యొక్క ఆజ్ఞలు.

దాదాజీ యొక్క ఆజ్ఞలను పాటించడం అంటే ఎ.ఎమ్.పటేల్ యొక్క ఆజ్ఞలను పాటించటం అని అర్ధంకాదు. ఇవి చతుర్దశ భువనాలకు ప్రభువైన దాదా భగవాన్ ఆజ్ఞలు. దీనికి నేను గ్యారంటీ యిస్తున్నాను. అవును. అవి నా మాద్యమం ద్వారా మీకు లభిస్తున్నాయి. వాటిని పాటించండి. నేను కూడ స్వయంగా దాదాభగవాన్ యొక్క ఈ ఆజ్ఞలలో ఉంటాను.

జై సచ్చిదానంద్

# ప్రాత: విధి

- శ్రీ సిమంధర స్వామికి నా నమస్కారము. (5)
- వాత్సల్యమూర్తి దాదాభగవాన్‌కి నా నమస్కారము. (5)
- ఈ మనోవచన కాయముల ద్వారా ప్రపంచములోని ఏ జీవికి కించిన్మాత్రము కూడా దు:ఖము కలుగకుండుగాక. (5)
- కేవలం శుద్ధాత్మానుభవం మినహా, ఈ ప్రపంచంలోని ఏ నశ్వర వస్తువు నందు నాకు కోరికలేదు. (5)
- జ్ఞానిపురుష్ దాదాభగవాన్ యొక్క ఐదు ఆజ్ఞలలో సదా నిలిచి యుండుటకు అనంతమైన శక్తి నాకు లభించుగాక. (5)
- జ్ఞాని పురుష్ దాదాభగవానుని వీతరాగ విజ్ఞానం సంపూర్ణంగా, సర్వాంగంగా కేవళ జ్ఞాన్, కేవళ్ దర్శన్ మరియు కేవళ్ చారిత్ర్ (కేవలం ఆత్మగా వర్తించటం) రూపంలో నాలో ప్రకటితమగుగాక. (5)

# నమస్కార విధి

- ప్రత్యక్ష దాదాభగవాన్ సాక్షిగా, వర్తమానంలో మహావిదేహ క్షేత్రంలో విహరించుచున్న తీర్ధంకర భగవాన్ శ్రీ సిమంధరస్వామికి అత్యంత భక్తి పూర్వకముగా నేను నమస్కరించుచున్నాను. (40)
- ప్రత్యక్ష దాదాభగవాన్ సాక్షిగా, వర్తమానంలో మహావిదేహ్ క్షేత్రం మరియు ఇతర క్షేత్రములలో విహరించు ఓం పరమేష్టి భగవంతులకు అత్యంత భక్తిపూర్వకంగా నేను నమస్కరించుచున్నాను. (5)
- ప్రత్యక్ష దాదాభగవాన్ సాక్షిగా, వర్తమానంలో మహావిదేహ్ క్షేత్రం మరియు ఇతర క్షేత్రములలో విహరించు పంచ పరమేష్టి భగవంతులకు అత్యంత భక్తి పూర్వకంగా నమస్కరించుచున్నాను. (5)

- ప్రత్యక్ష దాదాభగవాన్ సాక్షిగా, వర్తమానంలోమహావిదేహ క్షేత్రం మరియు ఇతర క్షేత్రములలో విహరించుచున్న తీర్థంకర ప్రభువులకు అత్యంత భక్తిపూర్వకంగా నమస్కరించుచున్నాను. (5)
- వీతరాగ శాసన దేవీ దేవతలకు అత్యంత భక్తిపూర్వకంగా నమస్కరించుచున్నాను. (5)
- నిష్పక్షపాతి దేవీదేవతలకు అత్యంత భక్తిపూర్వకంగా నమస్కరించుచున్నాను. (5)
- ఇరువది నాలుగు మంది తీర్థంకర భగవానులకు అత్యంత భక్తి పూర్వకంగా నమస్కరించుచున్నాను. (5)
- శ్రీ కృష్ణ భగవానునికి అత్యంత భక్తిపూర్వకంగా నమస్కరించుచున్నాను.(5)
- భరతక్షేత్రం (ఈ జగత్తు) లో ప్రస్తుతం విహరించు సర్వజ్ఞులైన శ్రీదాదా భగవాన్‌కి దృఢనిశ్చయంతో అత్యంత భక్తి పూర్వకంగా నమస్కరించుచున్నాను. (5)
- ఆత్మానుభూతిని పొందిన దాదాభగవాన్ యొక్క మహాత్ములందరికి అత్యంత భక్తి పూర్వకంగా నమస్కరించుచున్నాను. (5)
- సమస్త బ్రహ్మాండంలోని సమస్త జీవులలోని నిజస్వరూపమైన ఆత్మకు అత్యంత భక్తి పూర్వకంగా నమస్కరించుచున్నాను. (5)
- అందరిలోని నిజస్వరూపమే భగవత్స్వరూపము. కనుక సమస్త జీవులలో నేను భగవంతుని దర్శించెదను. (5)
- అందరిలోని నిజస్వరూపమే శుద్ధాత్మస్వరూపము. కనుక సకల జీవులలో నేను శుద్ధాత్మను దర్శించెదను. (5)
- అందరి నిజస్వరూపమే తత్త్వ స్వరూపము, శాశ్వతము. కనుక సమస్త విశ్వాన్ని తత్త్వజ్ఞాన రూపంగా దర్శించెదను. (5)

# నవకలమ్

(తొమ్మిది ప్రగాఢ అంతరంగ భావనలు)

1. ప్రియాతి ప్రియమైన దాదా భగవాన్ ! దేహధారియైన ఏ జీవాత్మయొక్క అహంకారము కించిత్ మాత్రము కూడా గాయపడుటకు నేను కర్తను, కారయితను, ప్రేరకుడను, అనుమోదకుడను కాకుండునట్లు నాకు పరమ శక్తిని ప్రసాదించు.

   ఏ దేహధారి జీవాత్మ యొక్క అహంకారమును ఏ మాత్రమూ గాయపరచకుండునట్టి సాత్విక వాణి, వర్తన, విచారము కల్గియుండునట్లు నాకు అనంతమైన ఆంతరంగిక శక్తిని అనుగ్రహించు.

2. ప్రియాతి ప్రియమైన దాదాభగవాన్ ! ఎవరి ధర్మ ప్రమాణములు కించిత్ మాత్రము కూడా కించపడుటకు నేను కర్తను, కారయితను, ప్రేరకుడను, అనుమోదకుడను కాకుండునట్లు నాకు పరమశక్తిని ప్రసాదించు.

   ఎవరి ధర్మము యొక్క ప్రమాణమును అణుమాత్రమైన కించపరచకుండుటకు తగిన, అందరికి ఆమోదయోగ్యమైన సాత్త్విక వాణి, వర్తన, భావన కల్గియుండునట్లు నాకు అనంతమైన అంతరశక్తిని ప్రసాదించు.

3. ప్రియాతి ప్రియమైన దాదా భగవాన్ ! ఉపదేశకులైన ఏ దేహధారి సన్యాసిని గాని, సన్యాసినిని గాని లేక ఆచార్యుని గాని విమర్శించకుండునట్లు, వారికి అపరాధము చేయకుండునట్లు, వారి పట్ల అవినయముగా ప్రవర్తించకుండునట్లు నాకు పరమశక్తిని అనుగ్రహించు.

4. ప్రియాతి ప్రియమైన దాదా భగవాన్ ! ఏ దేహధారి జీవాత్మపట్లకూడా నేను ద్వేషము, తిరస్కారము కలిగియుండకుండునట్లు; ఇతరులు అట్లు ద్వేషించుటకు, తిరస్కరించుటకు నేను కారణము కాకుండునట్లు; ద్వేషించుటను, తిరస్కరించుటను నేను ఆమోదించకుండునట్లు నాకు అనంతమైన శక్తిని అనుగ్రహించు.

5. ప్రియాతి ప్రియమైన దాదాభగవాన్ ! ఏ దేహధారి జీవాత్మ విషయంలో కూడా ఎప్పుడు గాని పరుషవాక్యాలను, హృదయాన్ని గాయపరిచే మాటలను నేను పలుకకుండునట్లు,

ఎవరైన అట్లు పలుకుటకు నేను కారణము కాకుండునట్లు, ఎవరుగాని అట్లు పలుకుటను నేను ఆమోదించకుండునట్లు నాకు పరమశక్తిని ప్రసాదించు.

ఎవరైనా పరుషవాక్యాలను గాయపరిచే విధంగా పలికినప్పటికీ నేను మృదుభాషను, సరళమైన భాషను పలుకుటకు నాకు శక్తినిమ్ము.

6. ప్రియాతి ప్రియమైన దాదాభగవాన్! స్త్రీ, పురుషుడు, నపుంసకుడు ఏ లింగధారియైనప్పటికి, ఏ దేహధారి జీవాత్మపట్ల కూడా నాకు కించిత్ మాత్రమైన విషయవికార సంబంధమైన దోషములు, వాంఛలు, చేష్టలు, విచారములు కలుగకుండునట్లు; ఇతరులకు అవి కల్గుటకు నేను కారణము కాకుండునట్లు, ఎవరుగాని వాటిని కలిగియుండుటను నేను ఆమోదించకుండునట్లు నాకు పరమశక్తిని అనుగ్రహించు.

నిరంతరము నిర్వికారిగా ఉండుటకు నాకు అనంతమైన శక్తినిమ్ము.

7. ప్రియాతి ప్రియమైన దాదా భగవాన్ ! ఆహార విషయంలో నాకు జిహ్వాచాపల్యము లేకుండునట్లు శక్తినిమ్ము. సాత్వికమైన సమతులాహారము తీసికొనుటకు నాకు పరమశక్తినిమ్ము.

8. ప్రియాతి ప్రియమైన దాదా భగవాన్ ! ప్రత్యక్షంగా గాని పరోక్షంగా గాని, జీవించి ఉన్న లేక మృతుడైన ఏ దేహధారి జీవాత్మనుగాని నేను విమర్శించకుండునట్లు, వారి పట్ల అపరాధము చేయకుండుటకు, అవినయముగా ప్రవర్తించకుండునట్లు, ఇంకొకరు ఆవిధముగా ప్రవర్తించుటకు నేను కారణము కాకుండునట్లు, వారిని నేను ఆమోదించకుండునట్లు నాకు పరమశక్తినిమ్ము.

9. ప్రియాతి ప్రియమైన దాదా భగవాన్! జగత్ కళ్యాణ కార్యములో సాధనముగ మారుటకు నాకు పరమశక్తినిమ్ము, శక్తినిమ్ము, శక్తినిమ్ము

(దాదా భగవాన్ జీవులందరిలో విరాజమానుడైన పరమాత్మ, పై విధంగా భగవంతుని అర్థించాలి. ఇది ప్రతి దినముయాంత్రికంగా చదువుటకు కాదు, హృదయంలో నిలుపుకోవాలి. దైనందిన జీవితంలో వీటిని అమలుపరచాలన్న దృఢ నిశ్చయంకలిగి దీనిని ప్రతిరోజూ చదవాలి. ఈ అమూల్య నవరత్నాలలో సమస్త శాస్త్రాల సారము ఇమిడి ఉన్నది.)

# శుద్ధాత్మకి ప్రార్థన

హే అంతర్యామీ పరమాత్మా! నీవు నాలో ఉన్నవిధంగానే జీవులందరిలో విరాజమానమై వున్నావు. నీ యొక్క దివ్య స్వరూపమే నా నిజ స్వరూపము. నా నిజ స్వరూపము'పవిత్ర ఆత్మ'.

హే శుద్ధాత్మ భగవాన్! నేను నీకు అభేదభావముతో అత్యంతభక్తిపూర్వకంగా నమస్కరించుచున్నాను. అజ్ఞానవశాత్తు నేను చేసిన తప్పులనన్నింటిని ✡ నీ ముందు ఒప్పుకొనుచున్నాను. నేను ఈ తప్పులకు పశ్చాత్తాపం చెందుతూ నీ క్షమకై అర్థిస్తున్నాను. ప్రభూ! దయతో నన్ను క్షమించు, నన్ను క్షమించు, నన్ను క్షమించు. ఆ తప్పులను మరల చేయకుండునట్లు నాకు శక్తిని ప్రసాదించు.

హే శుద్ధాత్మ భగవాన్! మాకు నీతోగల భేదభావము తొలగిపోయి మేమందరము నీతో అభేదతను పొందునట్లు ఆశీర్వదించు. మేము సదా నీతో అభేదతతో తన్మయాకారతను చెందెదము గాక!

( ✡ గతంలో నీవు చేసిన తప్పులను గుర్తు తెచ్చుకోవాలి)

# ప్రతిక్రమణ : దివ్యమైన క్షమాపణా విధానము

నేను దాదా భగవాన్ సాక్షిగా ✡ --------------యొక్క మనోవచన కాయము కంటె పూర్తిగా వేరైన పవిత్రాత్మకు నమస్కరించుచున్నాను.

నేను నా తప్పులను జ్ఞప్తికి తెచ్చుకొన్నాను (ఆలోచన) ✡✡

ఆ తప్పులకై నేను క్షమాపణ కోరుచున్నాను (ప్రతిక్రమణ)

ఆ తప్పులను మరల చేయనని దృఢముగా నిశ్చయించుకొనుచున్నాను (ప్రత్యాఖ్యాన్)

ప్రియాతి ప్రియమైన దాదాభగవాన్! ఈ దృఢ నిశ్చయమును పాలించు శక్తిని నాకు అనుగ్రహించు.

✡ మీ వలన గాయపడిన వ్యక్తి పేరు

✡✡ ఆ వ్యక్తిపట్ల మీరు ఒనర్చిన దోషాలను గుర్తుచేసుకోవాలి.

## English Books of Akram Vignan of Dada Bhagwan

1. Adjust Everywhere **(English & Telugu)**
2. Avoid Clashes **(English & Telugu)**
3. The Fault Is Of the Sufferer **(English & Telugu)**
4. Whatever Happened is Justice **(English & Telugu)**
5. Who Am I ? **(English & Telugu)**
6. Ahimsa : Non-Violence
7. Anger
8. Aptavani - 1
9. Aptavani - 2
10. Aptavani - 4
11. Aptavani - 5
12. Aptavani - 6
13. Aptavani - 8
14. Aptavani - 9
15. Autobiography of Gnani Purush A.M.Patel
16. Brahmacharya : Celibacy Attained With Understanding
17. Death : Before, During & After...
18. Flawless Vision
19. Generation Gap
20. Harmony In Marriage
21. Life Without Conflict
22. Money
23. Noble Use of Money
24. Pratikraman : The master key that resolves all conflicts
25. Pure Love
26. Right Understanding to Help Others
27. Science of Karma
28. Science of Speech
29. Shree Simandhar Swami : The Living God
30. The Essence Of All Religion
31. The Guru and The Disciple
32. Tri Mantra : The mantra that removes all worldly obstacles
33. Worries

**'Dadavani' Magazine is published Every month in Hindi, Gujrati & English**

## Persons to Contact

### Dada Bhagwan Parivar


**Adalaj** : **Trimandir**, Simandhar City,
Ahmedabad-Kalol Highway, Adalaj,
Dist.: Gandhinagar - 382421, Gujarat, India.
**Tel :** (079) 39830100, **Email :** info@dadabhagwan.org

**Ahmedabad** : **Dada Darshan**, 5, Mamtapark Society,
Behind Navgujarat College, Usmanpura,
Ahmedabad- 380 014. **Tel. :** (079) 27540408

**Rajkot Trimandir** : 9274111393
**Bhuj Trimandir** : (02832) 290123
**Godhra Trimandir** : (02672) 262300
**Morbi Trimandir** : (02822) 297097
**Amreli Trimandir** : 9924344460
**Surendranagar Trimandir** : 9879232877
**Vadodara Dada Mandir** : 9924343335

| | | | |
|---|---|---|---|
| **Hyderabad** | 9989877786 | **Hubli** | 9739688818 |
| **Bangalore** | 9590979099 | **Mumbai** | 9323528901 |
| **Chennai** | 9380159957 | **Delhi** | 9810098564 |

**USA-Canada : DBVI**
**Tel. :** +1 877-505-DADA (3232)
**Email :** USA email - info@us.dadabhagwan.org
Canada email - info@ca.dadabhagwan.org

**U.K. :** **AVDBF**
**Tel. :**+44 330-111-DADA (3232)
info@uk.dadabhagwan.org

| | | | |
|---|---|---|---|
| **Kenya** | +254 722 722 063 | **Singapore** | +65 81129229 |
| **Australia** | +61 421127947 | **New Zealand** | +64 21 0376434 |
| **UAE** | +971 557316937 | **Germany** | +49 700 32327474 |

**www.dadabhagwan.org**



# జీవిత లక్ష్యం

ఈ ప్రాపంచిక జీవనం నీకు నచ్చిన పక్షంలో వేరేమీ తెలుసుకోవలసిన అవసరం లేదు. ఒకవేళ నీకు ప్రాపంచిక జీవనం సమస్యాత్మకం అయినట్లయితే ఆధ్యాత్మికతను గురించి తెలుసుకోవలసిన అవసరం వుంది.

ఆధ్యాత్మికతలో, ఆత్మయొక్క స్వభావ స్థితులను తెలుసుకోవాలి. 'నేనెవరిని?' అనేది తెలిసికోవటంతో అన్ని సమస్యలూ పరిష్కరింపబడతాయి.

- జ్ఞాని పురుషుడు దాదాశ్రీ

Telugu

dadabhagwan.org

Price ₹30